# రత్నావళి

మహాకవి శ్రీహర్ష

విరచితము

మధురాంతకుల సత్యనారాయణ శాస్త్రి

సంస్కృతమునకు ఆంధ్రీకరణము

యస్. గున్నేశ్వరరావు బ్రదర్సు

రాజమహేంద్రవరము

వెల రూ 1-4-0

# భూమిక

మహాకవి కాళిదాసుఁడును, భవభూతియు మూఁడేసి మూఁడేసి నాటకములే రచించిరి. శ్రీహర్షుఁడు సంతరించినరూపకములును మూఁడే. దేవవాఙ్మయమున నీమూఁడునుఁ బ్రసిద్ధములు.

సంస్కృతసాహిత్యమున హర్షులు చాలమంది కలరు. వారిలో రత్నావళ్యాదికృతికర్త యగుహర్షుఁ డొకఁడు. మామల్లదేవీహీరపండితపుత్రుఁడ నని చెప్పుకొని నైషధమహాకావ్యమురచించినహర్షుఁ డొకఁడును. ఈ యిరువురును విభిన్నులు. రత్నావళీకర్త సరియగు పేరు హర్షవర్ధనుఁడు. ఇతఁడు కాశ్మీరదేశాధీశుఁ డయినట్లుగా, కల్హణుఁడు తలఁచినాఁడు. ఆతలఁపు సరియైనది కాదని పరిశీలకు లనుచున్నారు.

మనశ్రీహర్షుఁడు యశోవతి ప్రభాకరవర్ధనుల రెండవకుమారుఁడు. ఆదిత్యవర్ధన— మహాసేనగుప్తదేవులకు మనుమఁడు. హర్షునిసోదరుఁడు రాజ్యవర్ధనుఁడు, సోదరి రాజ్యశ్రీ. తండ్రి తరువాత నన్నగారు, అన్నగారి పిమ్మట హర్షుఁడును స్థానేశ్వరసింహాసనము నధిష్ఠించిరి. హర్షునిజననము క్రీస్తుపూర్వము ౫౯౦, [illegible] నిర్ణీతము. ఇతఁ డుత్తరహిందూస్థానమెల్ల స్వాయత్తముచేసికొన్న మహారాజు. బాణుఁడు, మయూరుఁడు, మతంగుఁడు మున్నగుమహాకవులు హర్షునికొలువులోనివారు. బాణుని హర్షచరిత్రము, రత్నావళీకృతికర్తయగుహర్షుని చరిత్రమే. హర్షుని రూపకములు ౧ ప్రియదర్శిక ౨ రత్నావళి ౩ నాగానందము.

ఈరూపకము లితఁడు రచించినవి కావని హర్షున కొక యపప్రథ. "శ్రీహర్షాదేర్ధావకాదీనాం ధనం" అను కావ్యప్రకాశికాకారుని వచనమునకు వ్యాఖ్యానకర్తలు "రత్నావళీకారుఁడు ధావకుఁ డనియు,

శ్రీహర్షుని పేరితో, ధనము పుష్కలముగాఁ బుచ్చుకొని వ్రాసె ననియు" దెల్పినారు. బాణుఁడే రత్నావళీకర్త యని మఱియొక వాదము. తనకీర్తి నమరమూర్తిని జేసిన బాణభట్టాదులను మహారాజు భాగ్యవంతులను జేయుటలో నాశ్చర్యమేమి! ఇంతకును, బాణధావకాదులు ధనికులగుట వలన నీకొంపమునుఁగక. ఇట్టిదే, తెలుఁగురాజులలోఁ గృష్ణదేవరాయ లకుఁగూడ నపకీర్తి యంటుకొన్నది. మహారాజు, మహాకవికూడ నగుట తటస్థించినచో నిట్టిది తప్పదన్నమాట. శ్రీహర్షుఁ డీమూఁడురూపకములేగాక, సుప్రభాతస్తోత్రము, అష్టమహాశ్రీచైత్యస్తోత్రము నను రెండు స్తవములను గూర్చెనని తెలియును.

ప్రకృతనాటిక 'రత్నావళి' లోఁ గథానాయకుఁడు, ఉదయన మహారాజు. ఈయనగాథలు ప్రతిగృహమున గానము చేయఁబడుచుండి నటులు 'మేఘదూత'లో నున్నది. సుబంధుఁ డితనిచరిత్రము వచన కావ్యముగ గ్రథించినాఁడు. బృహత్కథయందును విష్ణుపురాణమునం దును వత్సరాజప్రశంస విపులముగాఁ గలదు. కథానాయిక వాసవదత్తయు నుదాత్తగుణోత్తరయగు మహారాజ్ఞి. యౌగంధరాయణ మంత్రి సింహళేశ్వరపుత్రియగు రత్నావళికి, తనయేలిక వత్సరాజునకు పాణిగ్రహణోత్సవము చేయింపఁదలఁచి, సింహళేశ్వరుని ప్రార్థించి రత్నావళిని దీసికొనివచ్చుచుండఁ ద్రోవలో సముద్రమున నోడ మునిఁగి పోవుటయు, నప్పు డొక పలక దొరికి యామె బ్రతుకుటయు, సింహళ ద్వీపమునుండి తిరిగివచ్చుచుఁ గౌశాంబీపురవర్తకుఁ డాయవస్థలో నున్న యామెను రత్నహారముచే గుఱుతించి, తీసికొనివచ్చి యౌగంధరాయణున కిచ్చుటయు, నతఁడు వాసవదత్తకడ న్యాసముగా నుంచుటయు, నపుడు రత్నావళీ–వత్సరాజులు పరస్పరము చూచుకొని ప్రేమించుకొనుటయు, నింద్రజాలము కారణముగాఁ జివరకు వాసవదత్త యామెను దన చెల్లెలినిగాఁ దెలిసికొని వత్సరాజున కర్పించుటయు నిందలి ప్రధానకథ.

ఈకథనే వన్నెలుపెట్టి రసానుగుణముగా సంధానించి శ్రీహర్షుఁడు రత్నావళీనాటిక సంఘటించెను.

పాత్రపోషణమందు, సన్నివేశసంఘటనమునందు కాళిదాస భవభూతులకు శ్రీహర్షుఁడు దగ్గఱదగ్గఱగా నిలఁబడఁగల రూపకరచయిత.

అట్టి హర్షుని 'రత్నావళి' నితఃపూర్వము కొందఱుకవివరులు తెలుఁగుపఱచియున్నారు. ఆ తెలుఁగుసేఁతలతోపాటిదియును హృదయముగల మహాశయులయాదృతికి నోయిలిపట్టుచున్నది.

రాజమహేంద్రవరము<br>
సర్వజిదాషాఢము<br>
౧౯౪౭

మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి



# ఈ నాటికలో వచ్చు పాత్రములు

**పురుషులు :**

| | |
|---|---|
| వత్సరాజు | కౌశాంబీనగరాధిపతి |
| యౌగంధరాయణుడు | వత్సరాజుమంత్రి |
| వసంతకుడు | విదూషకుడు |
| బాభ్రవ్యుడు | వత్సరాజుకంచుకి |
| విజయవర్మ | రుమణ్వంతుని మేనల్లుడు |
| వసుభూతి | సింహళేశ్వరునిమంత్రి |
| ఐంద్రజాలికుడు | శంబరసిద్ధి |

**స్త్రీలు :**

| | |
|---|---|
| వాసవదత్త | వత్సరాజుదేవేరి |
| సాగరిక | సింహళేశ్వరునిపుత్రిక, రత్నావళి |
| కాంచనమాల | వాసవదత్తపుట్టింటిచేటిక, సఖి |
| సుసంగత | వాసవదత్తచేటి, సాగరికప్రియసఖి |
| మదనిక, చూతనిక, నిపుణిక | వాసవదత్త యితరచేటికలు |
| వసుంధర | ప్రతీహారి |

# రత్నావళి

నాంది

శా. పాదాగ్రస్థితయై పయోధరతతీభారంబునన్ మ్రొగ్గుచున్
శ్రీదాక్షాయణి యీశుచూపుగని యూరింపన్, సపర్యన్ ద్రపా
స్వేదంబుల్ పులకల్ వడంకుగ, శిరస్సీమం బడంజిమ్మ నా
చేదోయింబువు లంతరాపతితముల్ శ్రీలిచ్చి మిమ్మేలుతన్!

చ. తొడరినయుత్సుకత్వ మది తొందరసేయ, నిసర్గలజ్జ వెం
బడి వెనుకాడఁజేయ, మృదువాక్యములం జెప్పి చెలుల్ సమక్షమం
దిడ, నెమటన్ వసుం గని వహించినభీతి నవీనసంగతిన్
మృడునికపుంగిటం బులకరించుభవాని మిమ్ముం దలంచుతన్!

మ. అలయజ్ఞాహుతిలోఁ ద్రినేత్రాగ్నులును జ్వాలాచెం గృధావీప్తద్రు
ప్తులు; ఋత్విక్కులు పోగలూడ్వఁబడి కిన్నాల్ కుంరి రస్కద్గణం
బులు; దక్షుండు నుతించెఁ; దత్ప్రియయు వాపోయెన్; సురల్ పాఱెఁ; రం
చు లతాంగిం గని చెప్పి భిక్షుగునీశుం డోముతన్ మిమ్ములన్.

చ. మును మకరధ్వజున్ మథితమూర్తిని జేసితి వీవు నాకునై;
యనువగు! నీకు సిగ్గఱి సమక్షమునన్ బహుమూర్గ మోవ ధా
రుణిలి, స్వభావవక్రనె మక్కువను! కృష్ణగళగ్రహంబు తో
డన విడు మంచు లచ్చియు మృడానియుఁ గోపముదాఁపురింప నె
వ్వానిఁ గని పల్కె నట్టిభగవంతుఁడు మిమ్ముల నాదరించుతన్!

గీ. జయము నక్షత్రవిభున! కంజలి సురలకు!
ద్విజగణ మ్మాపదలు లేక వెలయుఁగాత!
పుడమి నెఱిపంట పెంపునఁ బొలుచుఁగాత!
చంద్రతనుఁడు రాజు ప్రతాపశాలి యగుత!

## ప్రస్తావన

### నాంద్యంతమున

**సూత్రధారుఁడు**—అతిప్రసంగ మేల? వసంతోత్సవమునకై యిప్పుడు సగౌరవముగా నాహ్వానింపఁబడి వివిధదేశములనుండి విచ్చేసి యున్న శ్రీహర్షదేవునిపాదపద్మోపజీవులయిన రాజసమూహము నాకిట్లాజ్ఞాపించిరి:—"మాస్వామియగుశ్రీహర్షదేవుఁ డపూర్వ వస్తురచనచే నందగించు 'రత్నావళీ'నాటిక సంతరించె నని కర్ణాకర్ణికగా వినియుంటిమిగాని, ప్రయోగమునఁ గనియుండలేదు. కావున సకలజనహృదయాహ్లాదియగునామహారాజునందలిగౌరవమునను, మాయందలియనుగ్రహమునను దానిని నాట్యపురస్సరముగాఁ బ్రదర్శింపవలయు" నని—కావున నేపథ్యరచన గావించి నే నిపుడు వారియభిలాషము నెఱవేర్చెదను. (పరిక్రమించి, చూచి) ఓహో, సర్వసభ్యులహృదయములును సమాకర్షింపఁబడి నటు లున్న వని నానిశ్చయము. ఏలయన?

మ. కవి శ్రీహర్షుఁడు గొప్పనేర్పరి; గుణగ్రాహుల్ సదస్యుల్; మహిన్
సవిశేషస్ఫురణంబు వత్సకథయున్; నాట్యంబు మాసొమ్మొ; యిం
దు విశేషించి యొకండొకండె మది విందుల్వెట్టు నయ్యారె! యె
ల్లవియుంగూడె, నిఁకేమి చెప్పుదు మదీయంబైనభాగ్యోన్నతిన్.

కావున నే నింక నింటికిఁ బోయి భార్యను బిలిచి సంగీతకమారంభింతును. (పరిక్రమించి, తెరవంకఁజూచి)ఇదిగో, మాయిల్లు. లోనికిఁ బ్రవేశించెదను. (ప్రవేశించి, బిగ్గఱగా) ఆర్యా! ఇటు రమ్ము.

నటి—[ప్రవేశించి] ఆర్యపుత్రా! వచ్చితిని. చేయవలసినపని యేదో సెలవిత్తురుగాక!

సూత్ర—ఓసీ! రాజులెల్లరు 'రత్నావళి' దర్శనోత్సుకులై యున్నారు, వేషరచనము గావింపుము.

నటి—(నిట్టూర్చి, ఉద్వేగముతో) ఆర్యపుత్రా! నీకేమయ్యా? నీవు నిశ్చింతుఁడవై నర్తించెదవు. నిర్భాగ్యురాలనగు నా కొక్క తెయే కూఁతురు. దానిని మీ రెక్కడో పరదేశమున నిచ్చితిరి. దూరదేశస్థుఁడైన యల్లునితో నీమెకుఁ బాణిగ్రహణ మెట్లు కాఁగలదో యని నామనస్సు కుదురుగా లేదు. ఇంక నేను నర్తించుట యెట్లు?

సూత్ర—ఓసీ! దూరస్థుఁడని విచారపడకుము. ఏలాఁడు,

గీ. దైవ మనుకూలమగు నేనిఁ దత్క్షణంబ
యితరమగుద్వీపమునుండి యేని, జలధి
నడుమనుండి యేనియు, దిగంతమ్మునుండి
యేనియుం దెచ్చి ఘటియించు నీప్సితంబు.

[ తెరలో ]

సెబాసు. భరతపుత్రా! సెబాసు. అది నిజమే! సంశయమేమి? (దైవ మనుకూలమగు నేని............మరలఁ జదువును)

సూత్ర—(విని, హర్షముతో) ఓసీ! ఇదిగో, నా చిన్నతమ్ముఁడు యౌగంధరాయణ వేషము దాల్చి వచ్చెను. రమ్ము! మనము కూడ వేషరచనమునకు సంసిద్ధుల మగుదము.

[అని నిష్క్రమింతురు]

ఇది ప్రస్తావన.

## విష్కంభకము

[అంతట, యథానిర్దిష్టుఁడగు యౌగంధరాయణుని ప్రవేశము]

యౌగం—అవును. సందేహ మేమి? (పైన మనుష్యులమాటలనువిని... మరలఁజదివి) అట్లు కాదేని, సిద్ధాదేశమును విశ్వసించి, సింహళేశ్వరుని ప్రార్థించి తీసికొనిరాఁబడుచున్నరాజపుత్రి సముద్రములో నోడ పగిలి మునిఁగి ఫలకమునుబడయు టెట్లు? సింహళదేశమునుండి తిరిగివచ్చుచున్న కౌశాంబీయుఁడగువణిజుఁ డా యవస్థలో నామె నుద్ధరించుట యెట్లు? రత్నమాలాచిహ్నముచే గుర్తుపట్టి యామె నిటకుఁ దీసికొనివచ్చు టెట్లు? (హర్షముతో) మాస్వామికి సర్వవిధముల నభ్యుదయములు పొడసూపుచున్నవి. (ఆలోచించి) సగౌరవముగా నే నామెను దేవి సంరక్షణమున నుంచుట మంచిదియైనది. ఆమెను దెచ్చుటకు వెళ్ళనెంచుకొని బాభ్రవ్యుఁడును, తోడుగావెళ్ళిన సింహళేశ్వర మంత్రి వసుభూతియు నెట్టెటులో సముద్రముదాఁటి కోసల ధ్వంసమునకు దండెత్తివెళ్ళినరుమణ్వంతుని గలిసికొన్నారని విన్నాను. దీనినిఁబట్టి రాజకార్యము నెఱవేఱినట్లే యైనను, నాకు ధైర్యముచాలకున్నది. ఈబానిసతనము కష్టమైనదిగదా!

గీ. ప్రభువునకుఁ బెంపొసంగుసేవనికి దైవ
మింపుగా నిట్లు చేయూఁత నిచ్చియుండఁ
గార్యసిద్ధి ఘటిల్లు నిక్కముగ; నైనఁ
బతికి జంకుదు స్వచ్ఛందపరుఁడ నగుట.

[తెరలోఁ గలకలము]

యౌగం— (విని) అదిగో, మృదుమధురమృదంగవాద్యముచే మిళితమైనసంగీతముతో నింపుగులుకుపౌరచర్చరీధ్వని యెదుట వినఁ

బడుచున్నది. మదనమహోత్సవసమయమునొప్పుగు లైన పౌరజనుల వేడుకఁ జూచుటకుఁ బ్రభువు ప్రాసాదాభిముఖుఁడై వచ్చుచున్నట్లు లూహించుచున్నాను. (పైకిఁ జూచి) ఓహో, ప్రభువు సౌధ మధిరోహించియే యున్నాఁడే! సతతము,

గీ. శాంతవిగ్రహుఁడును, బ్రియవసంతకుఁడును
రతియుతుఁడును, బ్రజానురక్తుఁడును నగుచుఁ
బ్రసవశరువోలె వత్సభూవరుఁడు వచ్చెఁ
దనమహోత్సవమును జూచుకొనెడి వేడ్క.

మఱి, నే నింటికిఁ బోయి తరవాయిపనిఁ జూచుకొందును.

(అని నిష్క్రమించును)

ఇది విష్కంభకము.

# రత్నావళి



## ప్రథమాంకము



[తరువాత వసంతోత్సవవేషముం దాల్చి, ఆసనస్థుండైనరాజు వసంతుండును బ్రవేశింతురు]

రాజు——(సహర్షముగాం జూచి) నెచ్చెలీ, వసంతకా!

విదూషకుండు——ఏమి సెలవు?

రాజు——

చ. పరులను ద్రుంచితిన్; ధరణిభారము మంత్రిశ్రేష్ఠుని నుంచితిన్;
గొలు తొలంగి భూప్రజలకున్ సుఖమబ్బె; సవంతిధారుణీ
శ్వరసుతను, న్నినున్, మధుని న్యాయముగాం దలపోసి యీస్మరుం
డురుధృతి నందుంగాక తనదోయన; నెన్నంగ నాకుం బందువో.

విదూ——(హాస్యముతో) వయస్యా, నీవన్నటులేగాని, నే నిటు లనుకొను చున్నాను. ఈమదనోత్సవము నీదియుంగాదు, కామదేవునిదియుం గాదు. బ్రాహ్మణబాలుండనైన నాయొక్కనిదే. (చూచి) సరియే, దానికేమి! అదిగో, మధుపానమున మత్తిల్లినమత్తకాశినులు తగవులాడి పుచ్చుకొనినచిమ్మనగొట్టములతో నీటిదెబ్బలు కొట్టుకొనుచు నర్తించునాగరికులను బరికింపుము. మృదంగధ్వనిమిళిత చర్చరీరావముతో బుక్కాపుంజపింజరితదిగ్భాగముగ నొప్పారి జరుగు నీమదనమహోత్సవశోభ నటు పరిశీలింపుము.

రాజు——(హర్షముతో నంతటం గలయంజూచి) ఓహో, పురజనుల యానందము మేర లేకుండ నున్నది.

సీ. సురుచిరకుంకుమచూర్ణగౌరములౌచుఁ
దొలిసంజకెంజాయఁ దలఁపు వాఱఁ
బొలుపారఁ జల్లిన బుక్కాములం జేసి,
స్వర్ణభూషణకాంతిసముదయమునఁ,
బటవాసభరమున వంగినశిఖలతో
వావిలిపూలతో వరలునట్టి
శేఖరమ్ములఁ జక్కఁ జెలువారుచున్నయీ
కౌశాంబి, వేసపుగతులకతన

గీ. విత్తపతిసర్వకోశసంపత్తి గెలిచి
పొలుచుచున్నది, బంగారుజలముపూఁత
గలుగుజనముల వెలసి యెక్కడ నరసిన
నొక్కటేపచ్చనగుకాంతి నొప్పుమిగిలి.

మఱియును,

శా. కేళాకూళుల జాఱి నీరు సతతముం గ్రీడింప, సద్యస్సము
ద్వేలపాత్రస్థవిమర్ద కర్దమత నందెం బ్రాంగణప్రాంతముల్;
ఖేలత్తత్ప్రమదాకపోలముల నోలిన్ జాఱు సిందూరను
శ్రీ లంటం బురకుట్టిమం బిది తనర్చెన్ రక్తశోభాఢ్యమై.

విదూ—(చూచి) వయస్యా! ఇదిగో, జాణలైనరసికులు చిమ్మనగొట్ట
ములనిండ నీరు నింపికొని కొట్టఁగా, సీత్కారము లొనరించు
వారవిలాసినులవిలాసములు వీక్షింపుము.

రాజు—(చూచి) వయస్యా! చక్కఁగాఁ గనిపెట్టితివి, ఏలయన?

మ. బలుబుక్కాములఁ జిమ్మచీకటులు పైపైఁగ్రమ్మ, మాణిక్యభూ
షలమేల్కాంతులఁ గొంత గానఁబడి, భాస్వత్సత్ఫణాభంగి, క్రో
వులు పైకి న్నిగుడంగ, నంత భుజగవ్యూహప్రపంచంబు, త
ద్బలిధామంబుస్వరూపలక్ష్మిఁ దలఁపింపం జేయు నెంతేనియున్.

విదూ—(చూచి) మిత్త్రమా! చూడుము చూడుము. మదనరసోచిత
ముగా నభినయించుచు మదనిక చూతలతికతోఁగూడి యిటులే
వచ్చుచున్నది. అదిగో, చూడుము.

[మదనలీల నటించుచు, ద్విపదీఖండము గానముచేయుచు
నిరువురు చేటికలు ప్రవేశింతురు]

మదనిక—(పాడుచుండును)

గీ. ప్రసవశరునకు రాయబారమ్ము నడపి
మావిమ్రోఁకల మొగ్గలఁ దావిఁ బఱపి
మగువలకుఁ గల్గుడెందపు బిగువుఁ జెఱపి
మలయపవమానపోతము నుసలుచుండె.

గీ. పొగడక్రొవ్విరులందలిపొలుపుగొనుచు
ప్రియులరాకల కెదల నువ్విళ్లుగొనుచు
సమయహరణము సైరింప శక్తిలేక
సంచరించును దరుణులసంఘ మిచట.

గీ. ఇచటఁ దొలుదొల్త మధుమాస మేచి, జనుల
హృదయతటముల మెత్తనిపదనుసేయ
మదనుఁ డటమీఁద నవకాశ మది తలంచి
వెలితివెట్టక పూవుఁదూఁపులఁ గలంచు.

రాజు—(చూచి) అవురా! ఈప్రవ్వఁబోండ్లయాట యెంతయింపుగా
నున్నది!

చ. మదిరము నాని మత్తిలినమానిని యాడఁగఁ, దత్కుచోన్నతిం
బ్రిదులువలగ్నముం గని భరింపక, కంపిలి వీడి హారమ
య్యదన నురంబు మోదెఁ; గడునాకులమై ముడి నూలికారుచుల్
వదలెఁ; బదస్థితిన్ ద్విగుణభంగిగ నందెలు మొఱ్ఱవెట్టెడిన్.

విదూ——(నవ్వుతో) వయస్యా! బద్ధపరికరలై యాడుచున్న వీరితో నేను గూడ నాడుచుఁ బాడుచు మదనోత్సవమును సమ్మానింతునా?

రాజు——(చిఱునవ్వు) నెచ్చెలీ! అట్లే కానిమ్ము.

విదూ——నీసెలవుప్రకారము గావింతును. (లేచి వారినడుమ నర్తించును) ఓచూతలతికా! ఓసీ, మదనికా! ఈచర్చరిక నాకుఁ గూడ నేర్పుఁడు.

మదనిక——(నవ్వి) వెఱ్ఱివాఁడా! ఇది చర్చరి కాదు, ద్విపదీఖండము.

విదూ——(హర్షముతో) ఓసీ! అట్లయినచో నీఖండమువలనఁ జేయఁబడునవి యుండ్రములా? లడ్డుకములా?

మదనిక——కాదు,కాదు వెఱ్ఱివాఁడా! అది పాడఁదగినదయ్యా!

విదూ——(ఆశ్చర్యముతో) పాడఁదగినదా? అట్లయినఁ, దినుటకు వీలు కానిదన్నమాట. మఱి, యిది నాకెందులకు? నాప్రియమిత్త్రుని కడకే పోయెదను.

(అట్లుచేసి సమీపించి కూరుచుండును)

(ఇరువురు, విదూషకు నాకర్షింతురు)

విదూషకుఁడు——(లాగుకొనును)

మదనిక——పిచ్చివాఁడా! ఎక్కడకుఁ బోయెదవు? రమ్ము. ఇక్కడనే యాడుకొందము. (అని బహువిధములుగా మొత్తుదురు)

విదూ——(చేయి లాగికొని, పరుగెత్తి, రాజును సమీపించి) ఓయీ, వయస్యా! నర్తించితినయ్యా!

రాజు——నెచ్చెలీ! క్రీడించితివా?

విదూ——లేదు, క్రీడింపలేదు; పాఱివచ్చితిని.

చూతలతిక——ఓసీ, మదనికా! చాలసేపాడితిమి. ఈపాటికిఁబోయి రాణిచెప్పినసందేశము మహారాజునకు మనవిచేయుదము రమ్ము

మదనిక—చూతలతికా! లెస్సగా జ్ఞాపకము చేసితివి. సరే! నడుపుము.

(పరిక్రమించి, సమీపించి)

ఇద్దఱు—ప్రభూ! జయము జయము. దేవిగా రాజ్ఞాపించుచున్నారు. (అర్ధోక్తిలో సిగ్గు నటించుచు) కాదు, కాదు. విజ్ఞాపనము సేయుచున్నారు.

రాజు—(హర్షముతో సవ్వి, సాదరముగ) మదనికా! ఈమదనమహోత్సవసమయమున 'ఆజ్ఞాపించు చున్నా'రనుట యే విశేషించి లెస్సగా నున్నది. కావున, నామెయాజ్ఞ యేమో చెప్పుము.

విదూ—ఓసీ! బానిసకూఁతురా! దేవి యేమి యాజ్ఞాపించినది?

చేటికలు—దేవిగా రిట్లు సెలవిచ్చిరి— "నేను మకరందోద్యానమునకుఁ బోయి రక్తాశోకతరుమూలమునఁ బ్రతిష్ఠితుఁడైన మన్మథునిఁ బూజింపవలసియున్నది గాన, నార్యపుత్రుఁడు సన్నిహితుఁడై యుండవలయును" అని.

రాజు—వయస్యా! ఏమి చెప్పను. మనకుఁ బండుగుమీఁదఁ బండువు వచ్చిపడినది.

విదూ—మిత్త్రమా! లెమ్ము. అక్కడకే పోవుదము. పోయినచో, బ్రాహ్మణబాలుఁడనైన నాకు స్వస్తివాచనమేదో దొరకవచ్చును.

రాజు—మదనికా! నీవు వెళ్ళి, మేమును మకరందోద్యానమునకు వచ్చుచున్నా మని చెప్పుము.

చేటులు—చిత్తము. (అని నిష్క్రమింతురు)

రాజు—వయస్యా, రమ్ము! దిగుదము.

[ఇరువురు ప్రాసాదావతరణము నటింతురు]

రాజు—మిత్త్రమా! మకరందోద్యానమునకుఁ ద్రోవ చూపుము.

విదూ—ఇటు, ఇటు. (అని పరిక్రమింతురు)

విదూ—(చూచి, ఆశ్చర్యముతో) మహారాజా! ఇదిగో, మలయమారుతముచేఁ గదల్పఁబడినమావిచిగుళ్ళపుప్పొళ్ళవలన వెలసినమేలికట్టులతో, మత్తమధుకరఝుంకారధ్వనులచే సమ్మిళితములైన కోకిలాలాపములతో, నీరాకకు సమాదరము చూపుచున్నటులీమకరందోద్యానము విలసిల్లుచున్నది. లోనికిఁ బ్రవేశింపుము.

రాజు—(అంతటఁ జూచి) ఔరా! మకరందోద్యానసౌందర్యము! ఇచట,

చ. బలుపవడంపుఁగాంతుల విభాసిలుపల్లవరాశి నెట్టిగాఁ,
గలరవషట్పదీరుతులకై వడి నస్ఫుటవాక్కు లొప్పఁగా
మలయమనోహరానిలసమాహతశాఖల నూఁగునీద్రుమం
బులు మధు వానియాని మదముం గనెనోయన నొప్పు సాకెకున్.

మఱియును,

సీ. చెలువలగండూషసేకాసవంబులు
మూలంబులం దొల్లి పోలిచియుంట
వకుళవృక్షములు చెల్వారఁగా నేఁడిట్లు
వెలిగ్రక్కెఁ గుసుమవృష్టులపసందు
మధు వాని యెట్టనో మగువమిన్నమనోజ్ఞ
వదనసుధాకరు పరిచయమున
నుడివోక చిరమునునుండి పువ్వులతోడ
సంపంగిచెట్టులు సొంపుగులికె

గీ. వెలఁదుకలశోకతరుల నంఘ్రులను దాఁచు
తఱిఁ, గరము మ్రోయు నూపురధ్వానములను
విని, యనుకరించువడువున భృంగసమితి
ఝుంకృతు లొనర్చుచుండె నిశ్శంకభంగి.

విదూ—(విని) వయస్యా! ఈతుమ్మెదలు నూపురశబ్దము ననుకరించుట లేదు; ఇది దేవీపరిజనమునం దెలచప్పుడే!

రాజు—నెచ్చెలీ! లెస్సగా నిర్ణయించితివి.

(తరువాత వాసవదత్త, కాంచనమాలయు, మాల్యవిశేషసవ్యగ్ర హస్తయగు సాగరికయుఁ, బరివారమును బ్రవేశింతురు)

వాసవ—ఓసీ, కాంచనమాలా! మకరందోద్యానమునకు దారిచూపుము.

కాంచన—దేవీ! రమ్ము, రమ్ము. (పరిక్రమించును)

వాసవ—ఓసీ, కాంచనమాలా! నేను మదనపూజ నెఱపవలసినయారక్తాశోకతరు వెంతదూరమున నున్నది?

కాంచన—దేవీ! ఇక్కడనే యున్నది, చూడలేదా? నిరంతరము పూవులనిండినయీమాధవీలత నీవు పెంచినదే. అకాలపుష్పోద్గమమున కనుదినము నాయాసపడి రాజుగారు పెంచిననవమాలిక యిదిగో, ఈవయి నున్నది. ఈలత దాఁటినపిమ్మటఁ బూజ నెఱపవలసినరక్తాశోకపాదప మున్నది.

వాసవ—అట్లయిన, రమ్ము. తొందరగా నటకే పోదము.

కాంచన—దేవీ! రమ్ము, రమ్ము.

[అందఱు పరిక్రమింతురు]

వాసవ—ఇదిగో, ఆ యశోకతరువు. ఇక్కడ నేను పూజ నిర్వర్తించుకొందును. కావునఁ బూజోపకరణములు తీసికొనిరమ్ము.

సాగరిక—(సమీపించి) దేవీ! అంతయు సంసిద్ధము.

వాసవ—(నిరూపించి తనలో) అయ్యో, పరిజనుల పొరపాటు. ఎవతెను నేను రాజుకంటఁబడకుండ రక్షించుచుంటినో, యామె యిపుడు రాజుకంటఁబడుసమయము వచ్చినది. కానిమ్ము, ఇపు డిట్లు మాటాడి చూచెదను. (పైకి) ఓసీ, సాగరికా! పరిజనమంతయు మదనోత్సవమునఁ బరాధీనమైయుండఁగా, సాగరికను విడిచిపెట్టి నీ విచ్చట కేల వచ్చితివి? ఈపూజాసామాగ్రి సర్వము కాంచనమాలచేతి కిచ్చి, వెంటనే యచ్చటకుఁ బొమ్ము.

సాగరిక—దేవిగారి సెలవు (అనియట్లు చేసి, కొన్ని యడుగులు వేసి తనలో) శారికను సుసంగత చేతి కిచ్చితిని. ఈపూజావిధానముఁజూడ నాకు వేడుక పొడముచున్నది. మాతండ్రిగారి యంతఃపురమున జరుగుమన్మథపూజయు, నిక్కడ జరుగుమన్మథపూజయు నొకటితీరు గలవియో; లేక, వేఱు వేఱు తెఱఁగుల నుండునో మఱుఁగున నుండి పరికించెదను. (పరిక్రమించి చూచి) ఇచటఁ బూజాసమయ మగులోగా, భగవదర్చనకు నేనును బూవులు కోసెదను. (అని పుష్పాపచయము నటించును)

వాసవ—కాంచనమాలా! అశోకతరుమూలమున భగవానుఁడగు కామదేవుని ప్రతిష్ఠ గావింపుము.

కాంచన—దేవిగారి సెలవు. (అని, అట్లు సేయును)

విదూ—(పరిక్రమించి, చూచి) వయస్యా! అందెలచప్పుడాఁగుటచే దేవి యశోకమూలము చేరె నని భావించుచున్నాను.

రాజు—మిత్రమా! బాగుగా నిర్ణయించితివి. ఇదిగో, దేవినిఁ జూడుము.

గీ. కుసుమసుకుమారదేహయై నయీకోమలాంగి
ప్రతమునకు సూక్ష్మమధ్య మేర్పడఁగఁ దాల్చి
రమ్యగతిఁ బంచబాణునిప్రక్క నున్న
చాపవల్లిమతల్లిపసందు నందె.

కావున, నుపసర్పింతము రమ్ము. (ఉపసర్పించి) ప్రియా, వాసవదత్తా!

వాసవ—(చూచి) ఓహో, ఆర్యపుత్రుఁడా!—ఆర్యపుత్రా! జయము జయము. ఆసనపరిగ్రహణముచే నీప్రదేశ మలంకరింపుఁడు. ఇదిగో, పీఠము, కూర్చుండుఁడు.

[రాజు నాట్యముచేఁ గూరుచుండును]

కాంచన—దేవీ! స్వహస్తార్పితములైనకుసుమకుంకుమచందనవస్త్రముల విలసిల్లురక్తాశోకతరువు దరిసి, మదనదేవుని పూజింపుము.

వాసవ—ఈపూజోపకరణము లిటు తెమ్ము.

(కాంచనమాల తీసికొనివచ్చును. వాసవదత్త యట్లు సేయును)

రాజు—ప్రియా, వాసవదత్తా!

గీ. అభినవస్నానపావనప్రభలఁ బొల్చి
చెలువుగాఁ గోసురంగంచుచీరఁ దాల్చి
యించువిలుకాని నర్చించునీవు, లేఁత
పవడపుంజెట్టుపైఁ దీవపగిదిఁ దగెదు.

మఱియును,

గీ. ఓప్రియా! కామపూజలో నున్న నీదు
కరకిసాలయముల నశోకమ్ము తగుల
నది యెదో క్రొంజివుళ్లతో నందగించి
నటులు కనిపించె నబ్బురమార నాకు.

అదియుఁగాక!

గీ. మదనునకు నీకరస్పర్శమహితభాగ్య
మబ్బదాయెను పాప మే మందు నింకఁ;
దనయనంగత నెంచి చిత్తమ్ములోన
నెంత నిందించుకొనునొకో! యిప్పు డతఁడు.

కాంచన—దేవీ! ప్రద్యుమ్నార్చన మైనది. ఇంక భర్తృపూజాసత్కా-
రము గావింపుము.

వాసవ—అట్లయిన, నాకుఁ బువ్వులు, గంధము తీసికొనిరమ్ము.

కాంచన—దేవీ! అంతయు సంసిద్ధము.

[వాసవదత్త నాట్యముచే రాజును బూజించును]

సాగరిక—(పూవులు పుచ్చుకొన్నదియై) అయ్యో, అయ్యో, పువ్వులు
కోయుటతో నన్నియు మఱచిపోయి చాలసేపు చేసితిని. ఇంక
వావిలికొమ్మచాటున డాఁగి చూచెదను. (చూచి, ఆశ్చర్య

ముతో) ఇదేమి? అపూర్వమన్మథుఁడు కనఁబడుచున్నాఁడే! మాతండ్రిగారియంతఃపురమునఁ జిత్రగతుఁడైనమన్మథు నారాధింతురు. ఇక్కడఁ బ్రత్యక్షమదను నారాధించుచున్నారేమి? నే నిక్కడనే యుండి కుసుమాయుధుని పూజించెదను. (అని పూవులు విసరుచు) కామదేవా! నమస్కారము. నీదర్శనము నాకు శుభదాయకము. నేను చూడఁదగినది చూచితిని. నీవు నాకమోఘదర్శనుఁడవు (అని ప్రణమిల్లును) ఆశ్చర్యము! ఎంతపరికించినను మనసు తీరుట లేదు. న న్నెవరును జూడకుండ నీపాటికిఁ బోయెదను. (అని నిష్క్రమించును)

కాంచన—ఆర్య వసంతకా! రమ్ము. నీవుకూడ స్వస్తివాచనము పుచ్చుకొనుము.

[విదూషకుఁ డుపసర్పించును]

వాసవ—(గంధము, పూలు, అలంకారములు నిచ్చుచు) ఆర్య! ఇదిగో, స్వస్తివాచనము స్వీకరింపుము. (అర్పించును)

విదూ—(హర్షముతో గ్రహించి) దేవీ! శుభము శుభము.

[తెరలో వైతాలికుఁడు పఠించును]

చ. అరుణుఁడు కాంతిబాసి చరమాద్రిపయింబడి యస్తమింప, భూ
వరులు హజారముం డగియవచ్చి భవత్సభఁ జేరినార లం
దఱు కనిపెట్టి; యోయుదయనా! విరిదమ్ములచెల్వు గెల్చు నీ
చరణము లంటి ప్రీతి మెయి జాబిలిపాదములట్లు కొల్వఁగన్.

సాగరిక—(విని హర్షముతో తిరిగిచూచి వేడుకతో)ఓహో, మాతండ్రిగారు నన్నిచ్చెద ననినయుదయనమహారాజు యీయన! పరప్రేషణదూషితమైనను నాశరీరము వీనిసందర్శనమున గౌరవింపఁబడినది

రాజు—ఏమి! మనస్సు లుత్సవములోఁ దగిలియుండుటచే సంధ్యాతిక్రమ
మైనను జూచుకొనలేదు. దేవీ! చూడుము.

గీ. విరహపాండురమగుముఖసగసిజముఁ
దగుణి యెదనున్న ప్రియుని గప్పుటచుకరణి
నుదయగిరితటి మఱువడియున్నయట్టి
బిలిని తూర్పుదిక్కు సూచనము సేయు.

దేవీ! లెమ్ము, గృహాభ్యంతరమునకుఁ బోదము.

(అందఱు లేచి పరిక్రమింతురు)

సాగరిక—ఓహో, దేవి బయలుదేఱెను. కానీ, నేనుగూడఁ దొరగాఁ
బోయెదను. (సస్పృహముగరాజును చూచి నిట్టూర్చి)
అయ్యో! ఈమందభాగ్యురాలాయనను చాలసేపు చూచుటకుఁ
గూడ నోఁచుకొనలేదు. (అని నిష్క్రమించును)

రాజు—(పరిక్రమించుచు)

చ. కనుఁగొను! దేవి! చంద్రునివికాసముద్రోసెడినీముఖాబ్జకాం
తి సరసి తమ్మిపూవులు వినిర్జితముల్ వెలవెల్లబోయె నం
తస; పరివారనారులనామృదుగీతులు విన్నపట్పదాం
గనలు నల్లనౌ మూకులకంబుల దాఁగఁ దొడంగె నల్లనన్.

[అందఱు నిష్క్రమింతురు]

ఇది ప్రథమాంకము.

## ప్ర వే శ క ము

[శారికాపంజరము చేతఁబుచ్చుకొనినసుసంగత ప్రవేశించును]

సుసంగత—అయ్యో, అయ్యో! ఇపుడు నాచేత నీసారికను బెట్టి నాప్రియసఖి సాగరిక యెక్కడకుఁ బోయియుండునో? (మఱొక వంకఁ జూచి) ఇదిగో, నిపుణిక యిట్లే వచ్చుచున్నది. ఈమెను జూచెదను.

(తరువాత నిపుణిక ప్రవేశము)

నిపుణిక—ప్రభువృత్తాంతముఁ దెలిసికొంటిని. పోయి, రాణికది నివేదింతును. (అని పరిక్రమించును)

సుసంగత—నిపుణికా! ఏమే! ఆశ్చర్యపడుచున్నదానివలెనుండి, నన్నుఁ జూచుకొనకుండ దాఁటిపోవుచున్నావు?

నిపుణిక—ఓహో, సుసంగతయా!—చెప్పు, సుసంగతా! బాగుగాఁ గని పెట్టితివి. నావిస్మయమునకుఁ గారణ మిది—"నేఁడు వత్సరాజు శ్రీఖండదాసుఁ డనుపేరితో శ్రీపర్వతమునుండి వచ్చినధార్మికుని యొద్ద నకాలకుసుమములు కలిగించునొకదోహదమును సంపాదించి, దానిచేఁ దాను బరిగ్రహించిన నవమాలికను పుష్పసమృద్ధముగాఁ జేయఁగలఁడఁట. సుసంగతి సరిగఁ దెలిసికొనుటకు దేవి నన్నుఁ బంపెంచినది. నీ వెక్కడకుఁ బ్రయాణమైతివి?

సుసంగత—ప్రియసఖి! సాగరికను వెదకుటకు.

నిపుణిక—సఖీ! సముద్గకము, చిత్రఫలకము, కుంచియలు చేతఁబట్టుకొని తొందరపడుచుఁ గదళీగృహమునఁ బ్రవేశించుచుండ సాగరికను జూచితిని. నీవు పోయి యామెను గలిసికొనుము. నేనును దేవిగారికడకుఁ బోయెదను. (అని నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

# రత్నావళి



## ద్వితీయాంకము



[చిత్రఫలకవర్తికలు చేతఁ బుచ్చుకొని మదనావస్థ నటించుచు
సాగరిక ప్రవేశించును]

సాగరిక—హృదయమా! శాంతింపుము. ఆయాసముమాత్రమే ప్రయోజనమైన యీమర్లభజనప్రార్థన మేల? ఎవఁడు కనఁబడుటచే నీ సంతాపము ప్రవృద్ధ మగుచున్నదో, వానినే మరలఁ జూడ యత్నించుట కేవలము తెలివితక్కువ. ఓనిర్దయహృదయమా! పుట్టినది మొదలు తోడుగానున్న యీనన్ను విడిచి క్షణమాత్ర దర్శనముచేఁ బరిచితుఁడైన వీనివెంటఁ దగులుటకు నీకు సిగ్గు లేదా?ఇంతకు, నిన్ననవలసినపని లేదు. వెడవింటివానితూఁపులకు వెఱచినదాననగుట నింతవచ్చినది. కానిమ్ము, మన్మథు ననవలయును. (అమర్షముతో) దేవా! కుసుమాయుధా! దేవదానవులను జయించినవాఁడ, వాఁడు దానిపై గత్తికట్టుట సిగ్గుగాదా? (ఆలోచించి) అవును. ఇంతకు నీ వనంగుఁడవు. మందభాగ్యురాలనగునా కీదుర్నిమిత్తములచేఁ జావు నిక్కము. (చిత్రఫలకముఁ జూచి) ఎవ్వరును రాకుండఁ జూచుకొని, యీ లేఖ్యములోనిప్రియునిఁ గన్నారఁ గాంచి, పిదప నాయభిమతమును నెఱవేర్చుకొందును. (సావష్టంభముగా నేకహృదయమై నాట్యముచే ఫలకము గ్రహించి, నిట్టూర్చి) ఈయగ్రహస్త

మతిమాత్రముగాఁ గంపించుచున్నది. ప్రియుని బరికించుటకు మఱియొక యుపాయము లేదు. ఎట్లో వ్రాసి చూచెదను.

(అని నాట్యముచేఁ జిత్రించును)

[సుసంగత ప్రవేశించును]

సుసంగత—ఇదిగో, కదలీగృహము. ప్రవేశింతును. (ప్రవేశించి, చూచి సాశ్చర్యముగా) ఈమె మహానురాగమున నుద్విగ్నహృదయయై యేదో వ్రాయుచు నన్నుఁ జూచుటయే లేదు. కానీ, కంటఁ బడకుండ నీమె యేమి వ్రాయుచున్నదో కనిపెట్టెదను. (స్వేచ్ఛగా వెనుకనుండి చూచి హర్షముతో) ఓహో, ప్రియుని జిత్రించుచున్నది. సెబాసు, ప్రియసఖీ! సెబాసు. అవును! రాయంచ కమలాకరము విడిచి వేఱొకచో నుండదు.

సాగరిక—(కన్నీటితో) దీనిని వ్రాసి ప్రయోజనమేమి? తెలిపిలేక కన్నీరుకాఱుచుండుటచేఁ గన్నులతోఁ గాంచుటకు వీలు లేకున్నది. (ముఖము పైకెత్తి కన్నీరు తుడుచుకొనుచు, సుసంగతను జూచి, ఉత్తరీయముచేఁ జిత్రఫలకమును గప్పుచుఁ జూచి చిఱునవ్వు నవ్వి) ఓహో, ప్రియసఖి సుసంగతయా! సుసంగతా! ఇచటఁ గూరుచుండుము.

సుసంగత—(కూరుచుండి ఫలకము గ్రహించి చూచి) సఖీ! నీచేఁ జిత్రింపఁబడిన యీతఁ డెవరు?

సాగరిక—(సిగ్గుతో) జరిగిన మదనమహోత్సవమందలి కామదేవుఁడు.

సుసంగత—(చిఱునవ్వుతో) ఓహో, ఏమి నీ నేర్పు?—కానిమ్ము. చిత్రము శూన్యముగాఁ గనిపించుచున్నది. ఇచట రతిదేవిని చిత్రించి జతపఱచెదను. (కుంచె పట్టుకొని, నాట్యమున రతి నెపమున సాగరికను వ్రాయును)

సాగరిక—(చూచి, కోపముతో) సఖీ, సుసంగతా! నన్ను వ్రాసితి వేమి?

సుసంగత—(నవ్వి) చెలీ, యకారణముగాఁ గోపించెదవేల? నీ వెట్టి కామదేవుని చిత్రించితివో, నేను నట్టి రతీదేవిని జిత్రించితిని. దీని కన్యథాభావింపక, యున్నసంగతి యేదో చెప్పుము

సాగరిక—(తనలో) ప్రియసఖి నాసంగతి కనిపెట్టినది. (ప్రకాశముగ) ప్రియసఖీ! నాకుఁ జాలసిగ్గుగా నున్నది. ఈవిషయ మెవ్వరికిఁ దెలియకుండు నటులు సేయుము.

సుసంగత—సఖీ! సిగ్గుపడకుము. ఇట్టి కన్యారత్నమున కిట్టివరునియం దే తప్పక యభిలాష ముండవలయును. అయినను, ఇది యెవ్వరికిఁ దెలియకుండునట్లు చేసెదను. బుద్ధిమంతురాలగు నీ శారిక యిది విని యెవరికైనఁ జెప్పునేమోయని.........

సాగరిక—సఖీ! వెనుకటికంటె నాసంతాప మధికతర మగుచున్నది.

(అని మదనావస్థ నభినయించును)

సుసంగత—(సాగరికగుండెపై చేయునైచి) చెలీ, ఊఱడిల్లు, యూఱడిల్లుము. ఇదిగో, ఈదీర్ఘికనుండి తామరాకులు తూండ్లు తీసికొని యిప్పుడే వచ్చెదను. (అని లేచి, వెళ్ళి,వచ్చి తామరాకులు తెచ్చి హృదయముపై నుంచును. తామరాకులచేఁ బ్రక్కయు తూండ్లచే వలయమును జేసి, మిగిలినపద్మపత్రములు సాగరికహృదయముపై వేయును)

సాగరిక—చెలీ! ఈతామరాకులు, ఈమృణాలవలయములు తీసివేయుము. చాలు, ఏల నన్ను నిష్కారణముగ వేపెదవు? ఒకమాట చెప్పుచున్నాను.

గీ. అందనిఫలమ్ముపై వలపలరె; సిగ్గు
నగ్గలంబయ్యె; నాత్మ తాదాత్మ్య మందెఁ;
బ్రియసఖీమణీ! ప్రణయంబు విషమ; మింక
మరణ మొక్కటియే నాకు శరణ మరయ. (అని మూర్ఛిల్లును)

సుసంగత—(సకరుణముగా) ప్రియసఖీ, సాగరికా! ఊఱడిలు మూఱడిలుము.

[తెరలోఁ గలకలము]

మ. గళవిభ్రష్ట దశిబాలకిణియుక్ఛృంఖలము గాఱించు మేల్పుత్రపా
ఖలతన్, మంజులపాదకింకిణులు మ్రోఁగన్ హేలమై ద్వారభూ
ములకుం దాఁటుచు నుత్సవాగతజనంబుల్ పాఱఁగా, సత్వర
తములు తన్మందురనుండి ప్రాఁగె, నగరుం జొచ్చెం బ్లవంగం బాగిన్.

మఱియును,

ఉ. పాఱిరి పూరుషత్వగుణభంగికి సిగ్గును మాని నపుంసకుల్;
చేరిరి వామనుల్ వెఱచి కంచుకికంచుకమధ్యంబులన్;
దూరముగాఁ దగం దొలఁగి దూఱిరి ప్రక్కలకుం గిరాతకుల్;
మీఱఁగ భీతిఁ గుబ్జులు నణంచి యచటం గ్రోఁతి నెంచుమఱిన్.

సుసంగత—(విని సంభ్రమముతోఁ) సఖీ! లెమ్ము లెమ్ము. ఇదిగో, చెడు
క్రోఁతి యిట్లే వచ్చుచున్నది.

సాగరిక—ఏమిచేయుదు మిప్పుడు?

సుసంగత—రా. ఈతమాలవృక్షశాఖలచీఁకటిలోఁ జొచ్చి దీనిగండము
గడచుదము. (వెళ్ళి యిరువురు నేకాంతమునఁ గూర్చుందురు)

సాగరిక—సుసంగతా! చిత్రఫలకమును విడిచి వచ్చితివా? ఎవరేని,
ఎప్పుడేని దానినిఁ జూతురేమో?

సుసంగత—భీరురాలా! ఇంకను చిత్రఫలకముతోఁ బనేమి? దధ్యన్న
మందు కన్నుపడి దుష్టవానరము పంజరముమూఁత వెల్లగించి
వచ్చి వేసినది. తెలివిగలయాసారిక యెగిరి యెక్కడకో పోవు
చున్నది రమ్ము. తొరగా దాని ననుసరింతము. ఇది మనమాటలు
కని పెట్టి బయటఁ బెట్టును.

సాగరిక—సఖీ! సరే! అటులు సేయుదము (అని పరిక్రమింతురు)

(తెరలో)

హీ. హీ. హీ ఆశ్చర్య మాశ్చర్యము!

సాగరిక—(చూచి) సుసంగతా! తెలియుటలేదా? మరల దుష్టవానరమే వచ్చుచున్నది.

సుసంగత—(చూచి నవ్వి) ఓసి, భయస్థురాలా! వెఱవకుము. ప్రభువు ప్రక్కనుండు వసంతకుఁడు వీఁడు.

[తరువాత వసంతకుని ప్రవేశము]

వసంతకుఁడు—హీ. హీ. హీ! ఆశ్చర్య మాశ్చర్యము! సెబాసు. శ్రీఖండదాసా! ధార్మికా! సెబాసు.

సాగరిక—(సాభిలాషముగాఁ జూచును)

సుసంగత—సఖీ! ఎందుల కిట్లు చూచుట? సారిక దవ్వునకుఁ బోయినది. రమ్ము, దానివెంటఁ బోవుదము. (అని నిష్క్రమింతురు)

వసంతకుఁడు—సెబాసు, శ్రీఖండదాసా! సెబాసు. ధార్మికా! అట్లు నీవు దోహద మిచ్చుటచే నీ నవమాలిక యిట్లున్నది. నిరంతరము వికసించుపుష్పగుచ్ఛములతో, దేవిగారు పెంచుమాధవీలతను బరిహసించుచున్నట్టు లున్నది. కావున, వెళ్ళి ప్రియమిత్రునకు నివేదించెదను. (పరిక్రమించి చూచి) ఇదిగో, ప్రియవయస్యుఁడు తాను గావించిన దోహదమున విశ్వాసముకలవాఁడగుట విరియఁబూచిన నవమాలికను బరోక్షమునుండియే ప్రత్యక్షముగాఁ జూచుచున్నట్టులు చూచుచు హర్షప్రఫుల్లనేత్రుఁడై యిటు లేవచ్చుచున్నాఁడు. ఆతని నుపసర్పింతును. (అని రాజుకడకుఁ బోవును.)

[తరువాత యథానిర్దిష్టుఁడగు రాజు ప్రవేశించును]

రాజు—(సహర్షముగా)

మ. అతిమాత్రోత్కలికన్, విపాండురరుచిన్, ప్రారబ్ధజృంభన్, సము
ద్ధతదూపశ్వాసనోద్గమప్రకటబాధన్, మన్మథాధీన నీ

లత నొండొక్కలతాంగిఁబోలెఁ గని వాలాయంబు దేవీముఖం
బలఘుక్రోధవిపాటలద్యుతులు మోయంజేతు నే నిమ్యేడన్.
ఆవృత్తాంతముఁ దెలిసికొనుటకు వెళ్ళినవసంతకుఁ డింకను రా లేదు.

విదూ—(తొందరగా నుపసర్పించి) ప్రియమిత్రమా! జయము జయము.
నెచ్చెలీ! కుశలమా?

రాజు—వయస్యా! సందేహ మేమి? మణిమంత్రౌషధులప్రభావ మచింత
నీయముకదా! చూడుము.

ఉ. ఆలమునం దుపేంద్రుగళమందు మణిం గని క్రుంగి రెల్లవై
రాళియు; మంత్రశక్తిహతమై వసుధాస్థలపుయాల నూనె స
ర్పాళియు; మేఘనాదహతులై మును లక్ష్మణవానరాదివీ
రాళి మహౌషధీపరిమళాప్తిని జీవితులైరి వెండియున్.

కావున, త్రోవఁ జూపుము. మన మిప్పుడు దానిని జూచి, కన్నులున్నం
దులకు ఫల మనుభవింతము.

విదూ—(సాటోపముగా) రమ్ము, రమ్ము.

రాజు—ఎదురుగా నడవుము. (ఇరువురు సగర్వముగ నడతురు)

విదూ—(విని, భయముతో మరలి రాజును పట్టుకొని సంభ్రమముతో)
వయస్యా! రమ్ము రమ్ము. పరుగెత్తుదము.

రాజు—ఎందులకు?

విదూ—అమ్మో! ఈపొగడచెట్టుమీఁద నేదో భూత మున్నదయ్యా!

రాజు—ఛీ, మూర్ఖా! నిర్భయముగా నడవుము. ఇక్కడ భూతము
లుండవు.

విదూ—స్పష్టముగా మాటలాడుచుండఁ, గా దందు వేమి పాపము!
నామాట నమ్మనిచో, ఎదురుగ నుండి నీవే వినుము.

రాజు—(అట్లు చేసి—విని)

గీ. విస్ఫుటాక్షరముల వెల్లివిరియుకతన
స్త్రీస్వభావమునం దియ్యతియ్యనగుట
నల్పదేహత మెల్లనిదగుటఁ జూడ
సారికావాక్కు లని మానసమునఁ దోఁచు.

(పైకిఁ జూచి, చిఱునవ్వు నవ్వి) ఇదిగో, సారిక.

విదూ—(పైకిఁ జూచి) నిజముగా సారికయే!

రాజు—(నవ్వి) అవును.

విదూ—వయస్యా! నీవు వట్టి పిఱికివాఁడవుసుమీ! సారికను భూత మనుకొన్నావు

రాజు—ఛీ, మూర్ఖా! నీకుఁగలభయము నాపై నారోపించుచుంటివా?

విదూ—అట్లయిన, నన్ను నివారింపకుము. (అని కోపముతో దండకాష్ఠ మెత్తి) ఓసి, దాసిసారికా! నిజముగా బ్రాహ్మణుఁడు భయపడుచున్నాఁడని నీ వెఱుఁగవా? పిశునివానిహృదయము వలె వంకరయగు నీదండకాష్ఠముతో, వెలఁగపండును పడఁగొట్టి నటులు నిన్నీపొగడచెట్టునుండి రాలఁగొట్టెదను.

(అని చంప నుద్యమించును)

రాజు—(నివారించుచు) మూర్ఖా! వినిపించుకొనుము. ఇది యింపుగా మాటాడుచున్నది. దీని నెందులకు భయపెట్టెదవు?

(ఇరువురు విందురు)

విదూ—(విని)'ఈబ్రాహ్మణునకు భోజనము పెట్టు'మని చెప్పుచున్నది.

రాజు—తిండిపోతున కెప్పుడును నదియేగోడవ. నిజముగా, సారికయే మనుచున్నదో చెప్పుము.

విదూ—(విని) ఇట్లనుచున్నది:—"సఖీ! ఈచిత్రఫలకమున నన్నేల వ్రాసితివి?—సఖీ! అకారణముగాఁ గోపింతువేల? నీ వెట్టి

కామదేవుని వ్రాసితివా? నేను నట్టిరతిదేవిని జిత్రించితిని" అని.

ఇదియంతయు నేమి, మిత్రమా!

రాజు—వయస్యా! నే నిట్లూహించుచున్నాను—ఒకానొకతె యనురాగవశమునఁ దనహృదయప్రియుని జిత్రించి, కామదేవుఁ డను నెపము వెట్టి సకియులయెదుటఁ గప్పిపుచ్చియుండును. చతురయగు చెలికత్తె రతివ్యపదేశముచే నామెను నాప్రక్క వ్రాసియుండును.

విదూ—వయస్యా! సెబాసు, సెబాసు! (అని చిటికె వేయును)

రాజు—మిత్రమా! మాటలాడకుము. మరల నేదో యనుచున్నది. అది వినిపించుకొందము. (ఇరువురు విందురు)

విదూ—వయస్యా! ఇట్లనుచున్నది—"సిగ్గుపడకుము. ఇట్టి కన్యారత్నమున కిట్టివరునియందే యభిలాష ముండుట యర్హ" మని.

రాజు—ఇక్కడ నేదో యపూర్వార్థ మున్నది.

విదూ—వయస్యా! పాండిత్యగర్వ మందకుము. ఈమెనోటినుండి విని, నే నంతయు నీకు వ్యాఖ్యానించెదను. ఈవ్రాయఁబడినయామె యెవ్వతెయో చూడవలయును.

రాజు—మిత్రమా! సావధానముగా వినవలయును మన వేడుక కవకాశమున్నది.

విదూ—వయస్యా! వింటివా?—"సఖి: ఈతామరాకులు తూంట్లుతీసి వేయుము. నిష్కారణముగా న న్నేల వేఁచెదవు?

రాజు—వినుటయే గాదు. అభిప్రాయముకూడఁ దెలిసికొంటిని.

విదూ—ఓయీ! బానిసకూఁతు రీసారిక యింకను కురకురమనుచున్నది. విని, అదియంతయు నీకు వ్యాఖ్యానింతును.

రాజు—మంచిమాట. (మరల వినుచున్నారు)

విదూ—వయస్యా! ఈబానిసకూఁతురు చతుర్వేదియగుబ్రాహ్మణుని వలె బుక్కులు పలుకుచున్నదే!

రాజు—వయస్యా! పరధ్యానమున నుండి, యీమె యేమి చెప్పినదో నిర్ణయింపలేకుంటిని.

విదూ—ఓయీ! ఇట్లనుచున్నది. (అందనిఫలమ్ముపై వల పలరే... అనుపద్యము చదువును.)

రాజు—వయస్యా! బ్రాహ్మణుఁడ వయిననీవు తప్ప, నింత నిట్టిబుక్కుల నెఱిఁగినవాఁ డెవఁడు?

విదూ—తరువాత, ఇదేమి?

రాజు—పాటయా?

విదూ—పాటయా? తరువాతఁ జెప్పినదేమి?

రాజు—వయస్యా! యౌవనములో నున్న యొకతె ప్రియతమునిఁ బొంద నేరక జీవితాశ వదలి పలుకుచున్నది.

విదూ—(పెద్దగా నవ్వి) ఏమి, ఈవంకరమాటలు! తిన్నగా మాటాడలేవా? 'నన్నే పొంద నేరక' అనలేవా? కానిచో, కుసుమచాపుని నెపముచేఁ గప్పఁబడువాఁడు మఱి యెవఁ డున్నాఁడు? (చేతితాళము వేసి బిగ్గఱగా నవ్వును)

రాజు—(పైకిఁజూచి) ఛీ, మూర్ఖా! నీవు గట్టిగా నవ్వినకారణమున నీసారిక భయపడి యెగిరిపోయినది. (పరికింతురు)

విదూ—(చూచి) ఓయీ, కోపింపకుము. ఇది యరఁటితోటలోనికిఁ బోయియుండును. రా, దాని ననుసరింతము.

(పరిక్రమింతురు)

రాజు—

గీ. ఓపఁజాలనిమన్మథతాప మూని
సుదతితన్వంగి సకియలయెదుటఁ బలుకు
పలుకు శిశుశుకసారికాభణిత మగుచు
విందువెట్టును ధన్యులవీనులందు.

విదూ—వయస్యా! ఇదిగో! కదలీగృహ, మిందుఁ బ్రవేశింతము. (ప్రవేశింతురు) ఈ బానిసకూఁతురగు సారికతో నేమి? ఇచ్చటఁ జిల్ల గాలిచేఁ గదలుచేఁతయాఁకులనీడను గూరుచుండి, కొంచెము సేపు విశ్రమింతము.

రాజు—నీవు చెప్పినట్లే గావింతము. (కూరుచుందురు)

రాజు—(ఓపఁజాలని.........ఇత్యాదిపద్యము మరలఁ జదువును)

విదూ—(ప్రక్కకుఁ జూచి) వయస్యా! ఇది, దుష్టవానరము. తలుపు తెఱచిపోయిన సారికాపంజర మయియుండవచ్చును.

రాజు—మిత్త్రమా! కనిపెట్టుము.

విదూ—నీ సెలవుప్రకారము చేయుదును. (పరిక్రమించి చూచి) ఇదిగో, చిత్రఫలకము. దీనిని గైకొందును. (గ్రహించి, నిరూపించి హర్షముతో) వయస్యా! దైవకరుణచే, నీ వదృష్టవంతుఁడవు.

రాజు—(వేడుకతో) మిత్త్రమా! ఏమది?

విదూ—ఓయీ! 'కుసుమచాపుని నెపమునఁ గప్పఁబడువాఁడు మఱి యెవఁ డున్నాఁడు?' అన్నమాట నిజమయినది.

రాజు—(హర్షముతోఁ జేతులుచాఁచి) చెలికాఁడా! చూపింపుము.

విదూ—నీకుఁ జూపింపను. ఆకన్యకకూడ నిక్కడఁ జిత్రింపఁబడి యున్నది. ఇటువంటికన్యామణిని కానుక లేకుండఁ జూపను.

రాజు—(కడియము నిచ్చుచునే బలాత్కారముగఁ దీసికొని చూచును. చూచి, ఆశ్చర్యముతో) వయస్యా! చూడుము.

గీ. చిత్రగతమైనయీయామె యేచెలువయొక్కొ!
మాయెడలఁ బక్షపాతంబు మల్లడింప
హేలఁ దమ్మిఁ గదల్చుచు నెసఁగి, రోజ
హంసియుంబోలె మానస మాక్రమించె.

అదియుఁగాక,

గీ. ముదితవదనము ధాత యపూర్వపూర్ణ
కుముదబాంధవుగా సృష్టిఁ బొరఁ జేసి
దాన, నిజపీఠవికచపద్మమ్ము ముడుఁగ
బెడఁదపాడముఁగ బెట్టు తబ్బిబ్బువడియె.

[తరువాత సాగరిక, సుసంగత ప్రవేశింతురు]

సాగరిక—సఖీ, సుసంగతా! మనకు సారిక దొరకనే లేదు. ఇంక, కదలీ గృహమునుండి చిత్రఫలకముఁ దీసికొని తొరగాఁ బోదము.

సుసంగత—సఖీ! అట్లే చేయుదము.

విదూ—వయస్యా! అవనతముఖియగు నీమెను చిత్రించినవా రెవరు?

సుసంగత—(విని) సఖీ! వసంతకునిమాటలు వినఁబడుచున్నవి. ఇక్కడఁ ప్రభువుకూడ నుండవచ్చును. కావున, కదలీగుల్మమునడాఁగి విందము. (ఇరువురు విందురు)

రాజు—వయస్యా! చూచుము, చూడుము. (ముదితవదనము ధాత.... ఇత్యాదిపద్యము మరలఁ జదువును)

సుసంగత—సఖీ! అదృష్టవంతురాలవు నీవల్లభుడు నిన్నే వర్ణించు చున్నాఁడు.

సాగరిక—(సిగ్గుతో) చెలీ, పరిహాసకమాడి, యీచెలికత్తెను చేలిక పఱుచుచుంటివా?

విదూ—(రాజునుగాంచి) ఈయవనతముఖిని వ్రాసిన దెవరని యడుగు చున్నాను.

రాజు—వయస్యా! సమస్తము సారికయే చెప్పివైచినది

సుసంగత—సఖీ! సారిక తన తెలివి వెలిఁబుచ్చుకొన్నది.

విదూ—నీకన్నులను దనుపుచున్నదా? లేదా?

సాగరిక—(విని, తనలో భయముతో) ఈతఁడే మనసునో యెఱుఁగ
నేరక నిజముగా నేను మరణవిశేషము లనుభవించుచున్నాను.

రాజు—వయస్యా! తనువునున్న దని యేమిచెప్పవు? చూడుము.

ఉ. ఊరుయుగంబు నెట్టులెటులో కడదాఁటి, నితంబసీమ నెం
దారి కడున్, వళిత్రయవిభాగవిషమం బవలగ్నమందు సం
చారము చిక్కియుండియుఁ దృషం గొని నాకను లుల్లసంగుచు
శ్రీరుచిరాద్రము లెక్కి యుసెంగని మస్రులనూరి కాంక్షతో.

సాగరిక—(విని, తనలో) హృదయమా! శాంతింపుము, శాంతింపుము.
ఊఱడుము, మూఱడుము. నిమనోరథము నేఁటికి మంచిదారిలోఁ
బడినది.

సుసంగత—సఖీ! వినఁబడెనా?

సాగరిక—నీవే వినుము. నీచిత్రలేఖనమునేర్పే కదా యిది!

రాజు—(నిర్వర్ణించి) వయస్యా! నిజముగా నేనీమెచేతనే వ్రాయఁబడి
నదో, ఈమెకు నాయందు గౌరవ మున్న దని నే నేల భావింప
రాదు? చూడుము.

గీ. ఆమె వ్రాసినయీచిత్రమందుఁ బడిన
యశ్రుజలబిందుపాళి, నాయంగమందుఁ
దత్కరస్పర్శవలన నుద్భవము లయిన
స్వేదకణపాళియట్టులు చెలువుగూర్చు.

విదూ—(ప్రక్కకుఁ జూచి) వయస్యా! ఇదిగో, మఱియొకటి. సరస
కమలినీదళమృణాళములతోనున్న శయన మీమెకామావస్థను
సూచించుచున్నది.

రాజు—మిత్రమా! లెస్సగాఁ గనుగొంటివి. అది నిజమే.

చ. బలుకుచముల్ పిఱుందులును బర్వుటఁ బార్శ్వములందు వాడి, దు
ర్బలతరమైన నెన్నడుము రాయకయుండుట వాడిపోక, ప్ర

క్కలకు భుజాలతోన్ విసరఁగా నలువైపుల స్రుక్కియున్నయా
జలజపత్రకోటరుఁదుప్పము సందులె చెప్పుఁ గృశాంగితాపమున్.

మఱియును,

మ. పరితాపంపుభరమ్ముచే నొగులుచున్ పద్మాక్షి పాలిండ్లని
ష్ఠురశైత్యము మండలంబులు వహింపంజాలుచుండంబుగా,
నగమందున్నవిశాలపద్మదళ మత్యంతస్నిగ్ధమై భావను
ర్భరమౌ మన్మథతాప మూఁగతి వచింపంజాల దావంతయున్.

విదూ—(నాట్యముచే మృణాళికను గ్రహించి) వయస్యా! ఆమెపీనస్తన
ములబరువుచే వాడినమృణాళహారము మఱియొకటి యిదిగో!
పరికింపుము.

రాజు—(గ్రహించి, వక్షమ్మునపై నిడుకొని) ఓ జడప్రకృతీ!

గీ. ఆమెకుచకుంభయుగళిమధ్యమునఁ బడుటఁ
జాల వసివాడితివి కాదె మృణాళసరమ!
తద్దయును సూక్ష్మమైన నీతంతువునకె
యెడము లేకుండె నచట, నీ కెటులు పాడము?

సుసంగత—(తనలో) అయ్యో! కష్టము. అయ్యో! కష్టము. అధికాను
రాగమున నపహృతచిత్తుఁడై ప్రభువు, అసంబద్ధముగ నాలోచిం
చుచున్నాఁడు. ఈమీఁదట, నూరకుండరాదు కాని, (పైకి) సఖీ!
ఎవనికై నీవు వచ్చితివో, ఆతఁ డేమటనే యున్నాఁడు.

సాగరిక—(అసూయతో) నేను వచ్చినది యెవనికొఱకు?

సుసంగత—(నవ్వి) ఓసీ, అన్యశంకినీ! చిత్రఫలకముకొఱకా? అయిన,
నిదిగో, పుచ్చుకొనుము.

సాగరిక—(రోషముతో) ఇట్టినీమాటల నర్థముచేసికొనుటకు నేను చతు
రను గాను. కావున, మఱియొకచోటికిఁ బోయెదను.

(అని వెళ్ళఁబోవును)

సుసంగత — ఓసీ, ఓర్వలేనిదానా! ఇచట నవంత సేపు నిలిచియుండుము.

ఈ కదలీగృహమునుండి చిత్రఫలకము పట్టుకొనివత్తును.

సాగరిక — అట్లే చేయుము.

[సుసంగత కదలీగృహాభిముఖముగ నడచును]

విదూ — (సుసంగతను జూచి, సంభ్రమముతో) వయస్యా! ఈయరఁటాకుచే నీచిత్రఫలకమును గప్పివేయుము. దేవిపరిచారిక యగు సుసంగత యిదిగో, వచ్చినది.

(రాజు వస్త్రాంతమున ఫలకమును గప్పును)

సుసంగత — (సమీపించి) ప్రభూ! జయము జయము.

రాజు — సుసంగతా! స్వాగతము. ఇచటఁ గూరుచుండుము.

సుసంగత — సరియే! (అని చెప్పి కూరుచుండును.)

రాజు — సుసంగతా! నే నిచట నున్నటులు నీ కెటులు తెలిసినది?

సుసంగత — సుసంగతియే గాదు. చిత్రఫలకముతో సర్వవృత్తాంతము నాకుఁ దెలిసినది. ఇది దేవిగారికడకుఁ బోయి నివేదించెదను.

(అని వెళ్ళఁబోవును)

విదూ — (అపవారించి భయముతో) వయస్యా! ఇది యన్నంతయుఁ జేయును. ఈగర్భదాసి వట్టివగరుఁబోతు. కావున, నేనో లంచము పాఱవేసి సంతోషపఱుపుము.

రాజు — బాగుగాఁ జెప్పితివి. (సుసంగత చేయిఁ బట్టుకొని, చేతినుండి కటకముఁ దీసి, కర్ణాభరణముకూడఁ దీసి సుసంగత కిచ్చి) సుసంగతా! ఇది నవ్వులాటసుమీ! నిష్కారణముగా నీవు దేవిమనస్సును బాధింపకుము.

సుసంగత — (తనలో) ప్రభువు ప్రసన్నుఁడుగా నున్నాఁడు. (పైకి) సందేహింపకుము. ప్రభువనుగ్రహముచే నేనును నవ్వులాటకే యంటిని. ఈకర్ణాభరణము నా కెందులకు? నాప్రియసఖిసాగు

సాగరిక తన్ను నీచిత్రఫలకమున నేల వ్రాయవలసివచ్చిన దని కోపముతో నున్నది. వెళ్ళి, యామెను బ్రసన్నురాలినిగాఁ జేయుము. అదే నాకుఁ బదివేలు.

రాజు—(సంభ్రమముతో లేచి) ఆమె యెక్కడ? చూపుము, చూపుము.

సుసంగత—ఈకదళీగుల్మములో డాఁగియున్నది.

విదూ—ఏమయ్యా! ఈచిత్రఫలకముకూడఁ దీనికొనివత్తును. ఎప్పుడేని దీనియుపయోగ ముండవచ్చును.

సుసంగత—ప్రభూ! ఇటు, ఇటు. (అందఱు కదళీగృహము నిష్క్రమింతురు.)

సాగరిక—(రాజును జూచి హర్షముతో, భయముతో, కంపముతో, తనలో) ఇతనిని జూచి సాధ్వసముతో నడుగుదీసి యడుగు పెట్టలేకుంటిని ఇంకఁ గర్తవ్య మేమి?

విదూ—(సాగరికం జూచి) హీ. హీ. హీ. ఆశ్చర్య, మాశ్చర్యము! మానవలోకమున నిటువంటికన్యామణి లేదు. ఈమెను సృజించిన ప్రజాపతికిఁగూడ నాశ్చర్యము కలిగియుండు నని భావించుచున్నాను.

రాజు—వయస్యా! నాతలంపుకూడ నదియే.

చ. నలువ జగత్త్రయంబునకు నాఁడెపుమేల్తొడవైనయట్టి లీ
లలన సృజించి యబ్రమము చెలంగ నిజాసనపద్మపత్త్రికాం
తులఁ దగుదృష్టులం బొడవు నూల్కొనఁ జేసి, చతుర్ముఖంబులన్
'బళిబళి'యంచు వేడ్క మెయిఁ బల్కి, యొగిం దలలూఁచియుండెడున్.

సాగరిక—(అసూయతో సుసంగతనుజూచి) సఖీ! ఇట్టి చిత్ర ఫలకమునా నీవు తీసికొనివచ్చినది? (అని పోఁబోవును.)

రాజు—సీ. కామినీ! కిన్క నరసెదుగాని, చూపు
వలపు కలదౌట యూకభావమ్ము గొనదు;

ఘనము తోందరవిడి, పదస్ఖలనములను
గడు నపయు నీనితంబము వెడఁదయగుట.

సుసంగత—ప్రభూ! ఈమె మిక్కిలి కోపస్వభావురాలు. కావున, హస్తాగ్రమునుబట్టి ప్రసన్ను గావింపుము.

రాజు—(ఆనందముతో) నీవు చెప్పినట్లే చేయుదును. (సాగరికచేయిఁ బట్టి స్పర్శసుఖము నటించును)

విదూ—ఓయీ! నీచే నీమె యొకయపూర్వశోభ నందినది.

రాజు—వయస్యా! నిజమే.

ఆ. వె. ఈమె లోకమాత; యీమెకరం బిది
పారిజాతవిటపిపల్లవంబు;
అటులు కాకయున్న, నమృతద్రవం బిటు
స్వేదకైతవమునఁ జిందునోటు.

సుసంగత—సఖీ! నీవు సరసురాలవు కావుసుమీ! పతిహస్తముల యవలంబనమున నుండియు నిప్పుడు కోపము విడువకున్నావు.

సాగరిక—(బొమముడితో) సుసంగతా! ఇంకను మాన లేదా?

రాజు—చెలీ! సకియలపై నిట్టికోపానుబంధము తగదు.

విదూ—ఏమమ్మా! ఆఁకలిగొన్నబ్రాహ్మణునివలెఁ గోపింతువేల?

సాగరిక—సఖీ! నీతో మాటాడనులే.

రాజు—ఓసి కోపనా! సమానప్రతిపత్తిగలచెలులవిషయమున నీకోపము కూడనిది.

విదూ—ఓయీ! ఈమె దేవేరియగునపరవాసవదత్తకదా!

(రాజు చకితుఁడై సాగరికచేయి విడుచును)

సాగరిక—సుసంగతా! ఇప్పు డిక్కడఁ జేయున దేమి?

సుసంగత—సఖీ! ఈతమాలవిటపములచాటునుండి యిట్లే పోవుదము.

(నిష్క్రమింతురు)

రాజు—(ప్రక్కకుఁ జూచి విస్మయముతో) వాసవదత్తాదేవి యెక్కడ!

విదూ—కాదు, కాదయ్యా! అతిదీర్ఘరోషమునుబట్టి యీమె యపర వాసవదత్త యని నే నంటిని.

రాజు—ఛీ, మూర్ఖా!

గీ. భాగ్యవశమున నెట్టెటో ప్రాప్తయగుచుఁ
గంఠ మందక, ప్రకటరాగమున నొప్పు
రమ్యరత్నావళింబోలె రమణి నీవు
జాఱఁబెట్టితి నాదుహస్తములనుండి.

[వాసవదత్త, కాంచనమాల ప్రవేశింతురు]

వాసవ—సఖీ! కాంచనమాలా! ఆర్యపుత్రుఁడు పరిగ్రహించిననవమాలిక యిపు డెంతదూరమున నున్నది?

కాంచన—ఈకదళీగృహముదాఁటిన తరువాత.

వాసవ—అయిన నక్కడకే పోవుదము.

కాంచన—రమ్ము, రమ్ము. దేవీ! (పరిక్రమించును)

రాజు—మిత్త్రమా! నాప్రియతమ యిపు డెచటఁ గనఁబడును?

కాంచన—దేవీ! దేవరవారు సమీపమున మాటాడుచున్నారు, దేవి గారికొఱకే నిరీక్షించుచుఁ గూరుచున్నటులు తలంచెదను. వారిని సమీపింపుము.

వాసవ—(సమీపించి) ఆర్యపుత్రా! జయము జయము.

రాజు—(అపవారించి) వయస్యా! చిత్రఫలకము కప్పి వేయుము.

(విదూషకుఁడు గ్రహించి చంకలో నుంచుకొనును)

వాసవ—ఆర్యపుత్రా! నవమాలిక పుష్పించినదా?

రాజు—(ఆశ్చర్యముతో) దేవీ! మేము ముందర వచ్చియు, నీ వింకను రాలేదని నవమాలికను జూడనేలేదు రమ్ము, మనమిరువురము కలిసియే చూతము.

వాసవ—(చూచి) ఆర్యపుత్రునిముఖానురాగమువలననే నవమాలిక కుసుమించినటులు నాకుఁ దెలిసినది. ఇంక, నేను రాను.

విదూ—అమ్మా! అట్లయినచో మేము పరాజితులమైతిమి.

[అని బాహువులు చాచి నాట్యముచేయును. చంకలోనుండి జారిపడినఫలకముఁ జూచి, విషాదము నటించును]

రాజు—(అపవారించి, వ్రేలితోఁ జూపుచు వసంతకునిముఖముఁ జూచును)

విదూ—(అపవారించి) మిత్రమా! మిత్రమా! కోపింపకుము నేనే కప్పివేసెదను.

కాంచన—(ఫలకము గ్రహించి) దేవీ! ఈచిత్రఫలకమున నేమి వ్రాయఁబడినదో చూడుము.

వాసవ—(చూచి, తనలో) ఇతఁడార్యపుత్రుఁడు. ఈమెయో, సాగరిక. (పైకి రాజునుగాంచి) ఆర్యపుత్రా! ఏమి యిది?

రాజు—(సవైలక్ష్యముగ నవ్వి) వయస్యా! ఏమి చెప్పను?

విదూ—(అపవారించి) ఓయీ! విచారింపకుము. ప్రత్యుత్తరము నేను చెప్పెదను. (ప్రకాశముగా వాసవదత్తతో) అమ్మా! అన్యథా భావింపకుము. ఎవనిచిత్రము నాఁడు వ్రాయుట కష్ట మని నే నన్నమాటమీఁదఁ బ్రియమిత్రుఁ డిది వ్రాసి తననేర్పుచూపెను.

రాజు—వసంతకుఁడు చెప్పినట్లే.

వాసవ—(ఫలకమును జూచి) ఆర్యపుత్రా! ఈమె యెవతెయో నీ ప్రక్క వ్రాయఁబడియున్నది. అది, ఆర్యవసంతకులచాతుర్యము కాఁబోలు!

రాజు—(సవైలక్ష్యముగా నవ్వి) మఱొకవిధముగా శంకింపకుము. ఈమె నే నూహించి వ్రాసినదిగాని, యిదివఱకుఁ జూచినది కాదు.

విదూ—ఇట్టియామెను నే నెన్నఁడును జూడలేను. నాయజ్ఞోపవీతముతోడు.

కాంచన—(అపవారించి) ఎప్పుడేని, ఘుణాక్షరన్యాయముగా నిట్టిది జరుగవచ్చును. కావునఁ గోపింపకుము.

వాసవ—(అపవారించి) ఓసీ, ఋజుస్వభావురాలా! ఈతనివంకర మాటలు నీ వెఱుఁగవు. వీఁడు వసంతకుఁడు. (పైకి రాజుతో) ఆర్యపుత్రా! ఈచిత్రము చూచుటతో నాతల నొచ్చుచున్నది. ఆర్యపుత్రుఁడు సుఖముండుఁగాక! నేను పోయెదను.

(అని లేచి వెళ్ళఁబోవును)

రాజు—(చీరకొంగు పట్టుకొని) దేవీ!

చ. 'కనికర మూను' మంచుఁ బలుకందగ దద్దియుఁ, గిన్కలేమి; 'నిం
క నిటులు సేయ' నంట సరిగా దది దోసమునొప్పినట్లు; 'త
ప్పునఁ బొనరింపలే' దనుట పోల, దసత్యముగా నెఱింగె; దే
యనువునఁ జెప్పనో? హృదయప్రియ! నే నెఱుఁగన్ నిజంబుగన్.

వాసవ—(వినయముతో వస్త్రాంతము లాగుకొనుచు) ఆర్యపుత్రా! అన్యథా భావింపకుము. వాస్తవముగా నాకుఁ దలనొప్పి వచ్చుచున్నది. కావునఁ బోయెదను. (అని నిష్క్రమింతురు)

విదూ—ఓయీ! అదృష్టవంతుఁడవు, అకాలజలదమువలె వచ్చి యీ వాసవదత్త సులువుగా వెళ్ళిపోయినది.

రాజు—ఛీ, మూర్ఖా! ఆనందపడకుము. పోవుచున్న దేవిగూఢకోపము నీవు కనిపెట్టలేవైతివి, చూడుము.

ఉ. కనుబొమఁ గిన్కఁ ద్రిప్పిన, ముఖంబు వినమ్రముగనుండె; నాదెసన్
గనుఁగొని భేదకారిహాసనం బొనరించిన, నిష్ఠురోక్తియే
వినఁబడ; దశ్రుబిందువులవెల్లువ లూరినఁ, గన్నువిప్పి తి
న్నఁగనఁగన; దెంతరోషము కనంబడఁజేసిన, వీడ దర్మిలిన్.

కావున, రమ్ము. దేవి ననునయించుట కభ్యంతరమందిరమునకుఁ బోవుదము. (నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

## ప్రవేశకము

[ మదనిక ప్రవేశించును ]

మదనిక—(ఆకాశమున) కౌశాంబికా! ప్రభుసన్నిధిని కాంచనమాలను నీవు చూచితివా? లేదా? (విని) ఏ మనెదవు? ఆమె వచ్చివెళ్ళి కొంతసేపయినది ఇపు డామె యెక్కడనుండునో! అనియా? (ఎదురుగాఁ జూచి) ఓహో! కాంచనమాల యిల్లే వచ్చుచున్నది. ఈమెను సమీపించెదను.

[కాంచనమాల ప్రవేశించును]

కాంచన—(పట్టూహాస్యంతో) సెబాసు, వసంతకా! సెబాసు. ఈసంధి విగ్రహాలోచనములో నీవు యౌగంధరాయణమంత్రినిగూడ మించిపోయితివి.

మదనిక—(చిఱునవ్వుతో సమీపించి)సఖీ! కాంచనమాలా! వసంతకుని గట్టిగాఁ గొనియాడుచున్నావు. అతఁ డేమిచేసె నిప్పుడు?

కాంచన—సఖీ, మదనికా! ఎందులకు? దీనిని నీ వడిగి లాభములేదు. ఈరహస్యము నీవు దాఁచలేవు.

మదనిక—దేవిగారిపాదము లాన. ఎవ్వరికిని జెప్పను.

కాంచన—అట్లయిన వినుము. ఇపుడు నేను రాజగృహమునుండి తిరిగి వచ్చుచుండఁగాఁ జిత్రశాలికాద్వారమున వసంతకునకు, సుసంగతకు జరిగినసంభాషణ మొకటి వింటిని.

మదనిక—(వేడుకతో) చెలీ! ఆసంభాషణ మెట్టిది?

కాంచన—వసంతకుఁ డి ట్లనెను—"సుసంగతా! ప్రియవయస్యుని యనారోగ్యమునకుఁ గారణము సాగరికతప్ప మఱేదియుఁగాదు. మఱి, దానికిఁ బ్రతిక్రియ యోజింపుము.

మదనిక—అప్పుడు సుసంగత యేమనెను?

కాంచన—అపుడామె యిట్లు పలికినది—"చిత్రఫలకవృత్తాంతముచే సనుమానపడిన దేవిగారు సాగరికను సంరక్షింపుమని నా కొప్పగించి కానుకగా నలంకారము లనుగ్రహించినారు. అందుచే సాగరికకు దేవివేషము వేయించి, నేను కాంచనమాల వేషము వేసికొని ప్రదోషసమయమున ప్రభువువారి సన్నిధికి వచ్చెదను, నీవు నిక్కడనే యుండి నిరీక్షింపుము. తరువాత మాధవీలతా మంటపమున నామెకు ప్రభువునకు సమాగమము కాగలదు.

మదనిక—సుసంగతా! పరిజనవత్సల యగు దేవిని మోసగించు నీ సంకల్పము చెడ్డదిసుమీ!

కాంచన—చెలీ! ఇపుడు నీవెక్కడకు బయలుదేఱితివి?

మదనిక—అస్వస్థుడై యున్న ప్రభువు యోగక్షేమములు తెలిసికొనుటకు వెళ్ళి నీ వింకను రాలేదేమని దేవి చింతించుచు నన్ను పంపినది.

కాంచన—ఆ మహాదేవి వెఱ్ఱినమ్మకముగల యమాయికురాలు. (పరిక్రమించి చూచి) ఓహో! ప్రభు విచట ననారోగ్యమను నెపము పెట్టి మదనావస్థను గప్పిపుచ్చి, దంతతోరణవలభిపై గూర్చుండి యున్నాడు. రమ్ము, ఈ సంగతి దేవిగారికి మనవిచేయుదము.

(నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

# రత్నావళి



## తృతీయాంకము

[తరువాత మదనావస్థను నటించుచుఁ గూర్చుండినరాజు
ప్రవేశము]

రాజు—(ఉత్కంఠతో నిట్టూర్చి)

మ. స్మరతాపానలమున్ సహింపుము మనంబా! నేఁడు తాపోపశాం
తి రహింపన్ గతిలేద; యూరకిటు లార్తింగూరఁగానేల? బం
ధురమాచందనసుందరద్రవముచెన్నుం గేర మీఱు తత్పాణి, దు
ర్భరతం బూనియు, మూర్ఛతం దడవు నీపై నుంచనైతిం గటా!

అవురా? ఎంత యాశ్చర్యము!

గీ. ఒరులు కేరికి గుఱిగాని తెఱఁగు కలిగి
సహజముగ నాదుచిత్తము చంచలంబు;
మఱి, స్మరుం డతిదారుణమార్గణముల
నొక్కపెట్టున నెటు దాని నుదరఁగొట్టు?

(ఊర్ధ్వముగఁ జూచి) కుసుమాయుధా!

చ. స్మరునిశరంబు లైదనియు, మాదృశకామిజనం బసంఖ్య, మా
శరములకున్ శరవ్య మని చాలఁ బ్రసిద్ధి జగమ్మునందు; నా
తెఱఁగు విరుద్ధమై యిపుడు తేలెను నీదెస; మమ్ముఁ బంచతం
ఒఱపెద వీ వసంఖ్యమగుబాణపరంపరఁ జేసి యెంతయున్.

(ఆలోచించి) నిరూఢకోప యగుదేవికి లోచనగోచరయగుచుఁ దపించు
చున్నసారికనుగూర్చి వగచుచున్నటులుగా, నీయవస్థలోనున్న
నన్నుఁగూర్చి నేను వగచుట లేదు. అట్లేకదా!

ఉ. పదుగురముందరన్ శిరము వంచును, వారలు త న్నెఱింగి రం
చెదఁ గడుసిగ్గునై; నిరువు రే మనుకొన్న, నవ్వగాథ యంచునే
మదిఁ దలఁచున్; జెలుల్ నగిన, మౌనినివ్వెఱపాటు నందు; నా
ముదిత యెడంద సందడిగుబులొ గ్రనుభీతిమెయి న్నితాంతమున్.

ఆమెసంగతి యెఱుంగుటకుఁ బంపినవసంతకుఁ డాలసించుచున్నాఁడేల!

[ఆనందముతో వసంతకుని ప్రవేశము]

వసంత—(పరితోషమున) హీ. హీ. హీ. కౌశాంబీరాజ్యలాభమువలన నయినయానందముకంటె, నావలన నిపుడు ప్రియవచనము విన్న తరువాత మహారాజు మిక్కిలిగ నానందించు నని భావించు చున్నాను. కావున, వెళ్ళి ప్రియమిత్త్రునకు నివేదించెదను. (పరిక్ర మించి చూచి) ఓహో, ప్రియవయస్యుఁ డిటులే పరికించుచుఁ గూర్చున్నాఁడు. కావున, నుపసర్పించెదను. (ఉపసర్పించి) వయస్యా! జయము జయము. మిత్త్రమా! ఇష్టకార్యసిద్ధిచే దైవవశమున వర్ధిల్లుచున్నావు.

రాజు—(హర్షముతో) చెలికాఁడా! ప్రియురాలు సాగరిక కుశలమా?

విదూ—(గర్వముతో) త్వరలో నీవే వెళ్ళి తెలిసికొనఁగలవు.

రాజు—(పరితోషముతో) వయస్యా! ప్రియురాలిదర్శనముకూడఁ గాఁ గలదా?

విదూ—(అహంకారముతో) ఓయీ! బుద్ధివిభవమున బృహస్పతిని జయించిననేను మంత్త్రినైయుండఁగా, కాకపోవుట యనఁగా నేమి?

రాజు—(నవ్వి) ఇం దాశ్చర్యము లేదు. నీ కసాధ్య మేమున్నది? ఏమో చెప్పుము విస్తరించి, విందును.

(విదూషకుఁడు చెవిలో నిటులిటు లని చెప్పుచున్నాఁడు)

రాజు—(సపరితోషముగ) సెబాసు, వయస్యా! సెబాసు. ఇదిగో, నీకు బహుమానము. (అని చేతినుండి తీసి కటకము నిచ్చును)

విదూ—(కటకము తొడిగికొని, తన్నుఁ జూచుకొని యానందముతో) చక్కఁగా నున్నది. రాజముద్రతో నున్న శుద్ధసువర్ణకటకమును నాభార్యకుఁ జూపివత్తును.

రాజు—మిత్త్రమా! తరువాతఁ జూపవచ్చునుగాని, యింకను నెంత ప్రొద్దున్నదో కనిపెట్టుము.

విదూ—(పరిక్రమించి, చూచి హర్షముతో) ఓయీ! చూడుము చూడుము అదిగో, సూర్యభగవానుఁ డధికానురాగక్లిష్టహృదయుఁడై సంధ్యాకామినికి సంకేతము నేర్పఱిచినవాఁడువలెఁ జరమగిరిశిఖరారణ్యము ననుసరించి పోవుచున్నాఁడు.

రాజు—(చూచి, హర్షముతో) చెలికాఁడా! లెస్సుగాఁ గనుఁగొంటివి. సాయంకాల మయినది.

చ. పొడవగు నీజగం బఖిలముం దెలవాలికమున్న చుట్టిరాఁ
బడు పెను లోకచక్రరథపర్యటనంబున నస్తుచింత స
ప్పుడు మలిసంజెలో మిగిలిపోవు స్వకాంతులతె పైఁడియాకులై
తొడరు దిశాహ్వచక్రగతితో సగుణుం డపరాద్రి నిల్చెడిన్.

అదియుంగాక,

గీ. "నేనె మేల్కొల్పెదను నిన్ను నిద్రనుండి
సమయ మగు దెంచెఁ బద్మాస్య! చనెద" ననుచు
నరుణుఁ డబ్జిని నోదార్చునటులు తోఁప
నస్తమస్తకవిన్యస్తహస్తుఁ డయ్యె.

కావున, నిఁక లెమ్ము. ఆమాధవీలతామంటపమునకే వెళ్ళి ప్రియురాలి సంకేతావసరము నిరీక్షింతును.

విదూ—బాగుగా సెలవిచ్చినారు (అని లేచును)

విదూ—(చూచి) వయస్యా! చూడు చూడు. ఇదిగో, అంధకారసంఘాతము, విరళతరుసమూహమును దళముగాఁ జేయుచు,

బురదలో మునిఁగినవనవరాహామహిషముల నల్లనికాంతులతోఁ దూర్పుకొండను గప్పుచు వ్యాపించుచున్నది.

రాజు—(హర్షముతో నంతటఁ జూచి) మిత్త్రమా! చక్కఁగాఁ గనుఁగొంటివి. అవును!

చ. తొలితొలి తూర్పుఁగొండదెసఁ దోఁచి, క్రమంబుగ నున్నయన్నిది
క్కులయెడ నేచి, చెట్టులును గుట్టలు పట్టణముల్ సమస్తభూ
స్థలులను నాఁచి, బిట్టుబలితంబయి యెల్లెడ నెల్లవారిచూ
పుల నరికట్టివైచెఁ దమముల్ హరకంఠరుచిప్రదీప్తముల్.

కావునఁ ద్రోవ చూపుము.

విదూ—రమ్ము, రమ్ము. వయస్యా! (నిష్క్రమింతురు)

విదూ—(నిరూపించి) మిత్త్రమా! ఈ మకరందోద్యానము దట్టమైన చెట్టులు కలదగుటచే నంధబంధురముగా నున్నది. దారి కనఁబడు టెట్లు?

రాజు—(పరిమళము నాఘ్రాణించి) నెచ్చెలీ! ముందు నడవుము. ఈ త్రోవ మనకు సుపరిజ్ఞాతమైనదే.

మ. ఇదియే సంపెఁగవాటి; యీయెసఁగుగుంపే సిందువారాళి; యి
య్యది దట్టంబగు కేసరంబులవనం బౌ; పాటలాపంక్తియే
యిది యంచుం దరుగంధసౌష్ఠవము నెంతే యాని మాచూడ, ను
న్మదమౌచీకటియందు గుర్తులబడిన్ మార్గంబు నువ్యక్తమౌ.

(నడతురు)

విదూ—వయస్యా! ఇదిగో, మత్తమధుకరములు వ్రాలుచున్నపొగడ పువ్వులతావి దిక్కుల నాక్రమించి, స్నిగ్ధమరకతమణిఖచితమగు శిలాతలమునఁ బాదసంచారమునకు సుఖముకలిగించి యీ మాధవీలతామంటపమును బ్రవేశించితిమి. కావున నీ విక్కడనే యుండుము. దేవీవేషముననున్న సాగరిక నిప్పుడే తీసికొనివచ్చెదను.

రాజు—అయినచోఁ, దొరగాఁ బోమ్ము.

విదూ—మిత్త్రమా! తపింపకుము. ఇక్కడ నున్నటులు వచ్చెదను.
(అని నిష్క్రమించును)

రాజు—ఈలోగా నే నీమరకతశిలావేదికపైఁ గూరుచుండి ప్రియురాలి సంకేతసమయమున కెదురుచూతును. (కూరుచుండిచింతతో) ఓహో! స్వభార్యాగమమున కిష్టపడనికాముకునకుఁ గ్రొత్తవెలఁదిపై నెట్టిపక్షపాతము! అవును!

చ. వలపులునిండుచూపులను వక్త్రముసం దిడ దేదొశంకఁ; గాఁ
గిలిగొని కంఠమున్ జనులు కీల్కొన బోమ్మనఁ గ్రుమ్మ; దెంతలెం
తలనిలుపంగఁ, 'బోదు' నని తాఁ బలుకున్ వెఱపూని; నైననున్
లలన వినిశ్చితస్థలమునన్ బ్రియుఁడెందము నాహరించెడున్.

ఏమి! వసంతుఁ డాలసించుచున్నాఁడు. ఈసంగతి వాసవదత్తాదేవికిఁగాని తెలియలేదుగదా?

[వాసవదత్త, కాంచనమాల ప్రవేశింతురు]

వాసవ—ఓసీ, కాంచనమాలా! నా వేషము వేసికొని సాగరిక నిజముగ నార్యపుత్త్రునికడకుఁ బోవునా?

కాంచన—దేవిగారి కసత్య మెట్లు మనవిచేయుదును? కానిచో, చిత్త్రశాలికాద్వారమునఁ గూరుచుండిన వసంతకునివలననే నీకు నమ్మికకలుగును.

వాసవ—అయిన, నటకే పోదము.

కాంచన—దేవీ! రమ్ము రమ్ము. (పరిక్రమింతురు)

[తరువాత ముసుఁగు వేసికొని వసంతకుఁడు ప్రవేశించును]

విదూ—(చెవులొగ్గి) చిత్త్రశాలికాద్వారమునందలి యడుగులచప్పుడును బట్టి సాగరిక వచ్చిన దని యూహించుచున్నాను.

కాంచన—దేవి! చిత్రశాలిక యిదిగో, నీ విక్కడనే యుండుము. నేను వసంతకునకు సైగ చేసెదను. (చిటిక వేయును)

విదూ—(హర్షముతో సమీపించి చిఱునవ్వి) సుసంగతా! కాంచనమాలవేషము సరిగా ధరించితివి నీవు. మఱి, సాగరిక యేది?

కాంచన—(వ్రేలితోఁ జూపుచు) ఇదిగో!

విదూ—(చూచి, విస్మయముతో) ఈమె యచ్చముగా వాసవదత్తయే!

వాసవ—(సంభ్రమముతో నపవారించి) కాంచనమాలా! నే నెట్లు తెలియఁబడిపోతిని. ఈ పాటికిఁ బోయెదను.

విదూ—అమ్మా సాగరికా! ఇటు రమ్మా.

(వాసవదత్త నవ్వి కాంచనమాలను జూచును)

కాంచన—దేవి! (అపవారించి, విదూషకుని తర్జనితో భయపెట్టుచు) తులువా! ఈమాట జ్ఞాపకముంచుకొమ్ము.

విదూ—సాగరికా! తొరగాఁ దొరగా రమ్ము. ఇదిగో, చంద్రభగవానుఁడు తూర్పుదెస నుదయించుచున్నాఁడు.

వాసవ—(సంభ్రమముతో నపవారించి) దేవా! మృగలాంఛనా! నమస్కారము. ఇతనిభావానుబంధము పరికించులోపుగా క్షణకాలము, అపవారితశరీరుఁడవై యుండుము.

(అని పరిక్రమించును)

రాజు—(ఉత్కంఠతోఁ దనలో) ప్రియాసమాగమము దగ్గఱకు వచ్చెను, నాచిత్తము మిక్కిలి యుత్తలపడుచున్నదేమి? ఔను!

గీ. సుదతి యాసన్నయైనప్డు మదనతాప
మగ్గలించినయటు తొల్త నగ్గలింప;
దతిసమాసన్నవర్షమౌనట్టివాస
రమ్ము తొల్తటికంటెఁ దీవ్రమగుఁగాదె?

విదూ—(విని) అమ్మా! సాగరికా! మాప్రియమిత్త్రుఁడు నీకొఱకే యుత్కంఠతో నిరీక్షించుచున్నాఁడు. కావున, నీరాక నతని కెఱిఁగించెదను. [వాసవదత్త తలపంకించును]

విదూ—(రాజును సమీపించి) వయస్యా! అదృష్టవంతుఁడవు. ఇదిగో, సాగరికను తీసికొనివచ్చితిని.

రాజు—(హర్షమునఁ దొందరగ లేచి) ఎక్కడ, ఎక్కడ?, సాగరిక!

విదూ—ఇదిగో నయ్యా.

రాజు—(సమీపించి) ప్రియా, సాగరికా!

చ. కలువలఱేఁడు మోము; నెఱికల్వలు కన్నులు; తామరల్ కరం
బు; లరఁటిపట్టె లూరుయుగముల్; తెఱతూఁడులు నీదు బాహువుల్
వెలఁదుక! యింకవీడి నను వేసవిఁ గొంగటఁ దెచ్చి యున్మథా
జ్వలితములౌ మదంగములఁ జల్లఁదనమ్మును జిమ్ము, ర మ్మొగిన్.

వాసవ—(కన్నీటితో నపవారించి) కాంచనమాలా! ఇట్టినాభర్త మరల నాతో నెట్లు మాటాడును? ఎంతయాశ్చర్యము!

కాంచన—(రహస్యముగా) దేవీ! నీ వన్నది నిజమేగాని, సాహసికు లయినపురుషు లేమి చేయుటకు జంకుదురు?

విదూ—అమ్మా! సాగరికా! మాప్రియమిత్త్రునితో నమ్మికకలిగి భాషింపుము. నేఁటికిని నిత్యరుష్టయగువాసవదత్తాదేవి దుర్వచనములచేఁ జెవులు గింగురుమనుచున్నవి. ఇంక నీ తీయనిపలుకులచే సుఖపెట్టుము.

వాసవ—(రోషముతో) ఓసీ, కాంచనమాలా! ఇట్టినేను పరుషభాషిణినా?—వసంతకుఁడు ప్రియభాషణుఁడా?

కాంచన—(అపవారించి, తర్జనితో భయపెట్టుచు) దుర్మార్గా! ఈమాట మఱవకుము.

విదూ—(చూచి) వయస్యా! చూడుము చూడుము. అదిగో! కుపితకామినీ కపోలములవలెఁ దెల్లనయినకాంతులతోఁ జంద్రభగవానుఁ డుదయించి యెల్లెడలఁ బ్రకాశింపఁజేయుచున్నాఁడు.

రాజు—(నిరూపించి, సస్పృహముగ) ప్రియా! చూడుము, చూడుము.

గీ. ఆత్మరుచులను నీయాస్య మపహరింప
శైలశిఖరము నెక్కి నిశాప్రియుండు
తత్ప్రతిక్రియఁ జేయ నూర్ధ్వకరుఁ డగుచు
నదిగో! యొప్పిదముగ నెట్టయెదుట నుండె.

కాని, ప్రియా! ఈతఁ డుదయించుట మూర్ఖతసుమీ! ఏలయన?

చ. కలువలకాంతి దొంగిలఁడొ? కన్నులకు న్ముదమీయలేఁడొ, చూ
పొలసినయంత మన్మథరసోదయముం గలిగింపలేఁడొ, నీ
విలసితవక్త్రచంద్రుఁ; డిట వెల్గఁగ వేఱొకచంద్రుఁ డేల? యో
పొలఁతి! సుధాకరత్వమును బొందెనుగాదొకో? నీదు మోవియున్.

వాసవ—(రోషముతో మేలిముసుఁగు తొలఁగించి) ఆర్యపుత్రా! నిజముగ నేను సాగరికనే. నీవు సాగరికాలగ్నచిత్తుఁడవై సర్వము తన్మయముగాఁ జూచుచున్నావు.

రాజు—(చూచి, ఆశ్చర్యముతో) అయ్యో, కష్టము! కష్టము! వాసవదత్తాదేవియా? వయస్యా! ఏమిది?

విదూ—(విషాదముతో) మిత్రమా! ఏమున్నది? చచ్చినచావువచ్చినది మనకు.

రాజు—(కూరుచుండి, దోయిలిబట్టి) ప్రియా! వాసవదత్తా! అనుగ్రహింపు మనుగ్రహింపుము.

వాసవ—(అతని కభిముఖముగాఁ గన్నీరుకార్చుచు) ఆర్యపుత్రా! అర్థములేనిమాట లాడకుము.

విదూ—(తనలో) నే నిక్కడఁ జేసెడి దేమి? కానీ, (పైకి) అమ్మా, నీవు మహానుభావురాలవు. మా ప్రియమిత్రుని యీ యొక్క తప్పిదమును మన్నింపుము.

వాసవ—ఆర్యా, వసంతకా! పాపము! ప్రథమసంగమమునందే విఘ్నము చేయుట నాది తప్పుగాని, ఆర్యపుత్రునిది కాదు.

రాజు—చూచుచుండఁగా నిట్లు తప్పుచేసి, యింకేమనను? అయినను, ఒకవిజ్ఞప్తి.

చ. లలన! భవత్పదంబుల నలక్తకకృతంబగు రక్తిమంబు నేఁ
డొలఁగ నొనర్చెదన్ శిరముతోఁ గదిసి గ్గ్న, నీముఖేందుమం
డలమును రోషరాహువు నెడన్ గ్రహియింపఁగఁ బుట్టు రక్తిమం
బొలఁపున మన్న, నీకరుణ నోకుపడన్వల నాకు నెంతయున్.

(అని పాదములపైఁ బడును)

వాసవ—(చేతితో నివారించుచు) ఆర్యపుత్రా! లెమ్ము లెమ్ము నీ హృదయమిట్టిదని యెఱిఁగియుండియు నల నెవ్వతె కోపించునో, యామె సిగ్గులేనిది. కావున, సుఖముండుము. నేను బోయెదను.

(అని వెళ్ళును)

కాంచన—దేవీ! అనుగ్రహింపుము. ఇట్లు కాళ్ళపైఁ బడినమహారాజును విడిచి వెళ్ళినదేవి, తరువాతఁ దప్పక పశ్చాత్తాపపడఁగలదు.

వాసవ—చాలు, మూర్ఖురాలా! అనుగ్రహమునకుఁగాని, పశ్చాత్తాపమునకుఁగాని యిక్కడఁ గారణమే మున్నది?—పోదము.

(నిష్క్రమింతురు)

రాజు—దేవీ! అనుగ్రహింపు, మనుగ్రహింపుము.

విదూ—ఓయీ! లెమ్ము లెమ్ము. వాసవదత్తాదేవి వెళ్ళినది. ఎందుకిచట నరణ్యరోదనము చేసెదవు?

రాజు—(ముఖము నెత్తి) దేవి యనుగ్రహము చూపకయే పోయినది.

విదూ—అనుగ్రహము చూపకపోవుట యేల! చూపినది కావుననే, మన మక్షతశరీరులమై యున్నాము.

రాజు—ఛీ, మూర్ఖా! నన్నిట్లు పరిహాసించుచుంటివా? నీమూలముననే యీముప్పు మూఁడినది. ఏలయన?

గీ. ప్రేమబహుమతి నానాఁటఁ బ్రీతిహెచ్చ
నకృతపూర్వము నాతప్పు నరసి దయిత
యిపుడు ప్రాణము విడుచుట యెట్లు నిజము;
హెచ్చుప్రణయంబు దోసఁగు సహింపఁగలదె?

విదూ—ఓయీ, కోపించినదేవి యేమి చేయునో తెలియదు. సాగరిక యింక జీవించునో, చంపునో?

రాజు—వయస్యా! నేను నిట్లే యనుకొనుచున్నాను. అయ్యో! ప్రియా, సాగరికా!

[వాసవదత్తవేషము ధరించినసాగరిక ప్రవేశించును]

సాగరిక—(ఉద్వేగముతో) ఈ దేవీవేషముతో సంగీతశాలనుండి దైవవశమున నెవరికంటను బడకుండఁ దిరిగివచ్చితిని. ఇంక నిపుడు కర్తవ్య మేమి?

విదూ—ఓయీ! మందుఁడవువలె నుందువేమి? దీనికిఁ బ్రతీకారము యోచింపుము.

రాజు—వయస్యా! అదే యాలోచించుచున్నాను. దేవీప్రసాదముతప్ప వేఱొకయుపాయము కనఁబడదు. రమ్ము, అక్కడకే పోవుదము.

(పరిక్రమింతురు)

సాగరిక—(విమర్శించి, కన్నీట) నాకు నేనే యురివేసికొని మరణించుట యిపుడు తగినపని. సంకేతవృత్తాంతము నెఱిఁగిన సుసంగత చేతను, దేవిచేతను బరాభవింపఁబడి యింక నుండలేను. కావున నశోకపాదపస్థలమునకుఁ బోయి తలఁచినటులుగావించెదను.

విదూ—(విని) ఉండవయ్యా, ఉండుము. అడుగులసడి వినఁబడుచున్నది. పశ్చాత్తప్తురాలై, దేవి యొకవేళ వచ్చుచున్నదేమో?

రాజు—వయస్యా! దేవి మహానుభావురాలు. అట్లే యయినచోఁ జూడుము తొందరగా!

విదూ—నీయాజ్ఞచొప్పునఁ జేయుదును. (అని నిష్క్రమించును)

సాగరిక—(సమీపించి) ఈమాధవీలతనే పాశముచేసి, యీయశోక తరువుననే యురివేసికొని యాత్మహత్యగావించుకొందును. (అని లతాపాశముగావించి) అయ్యో! తల్లిదండ్రులారా! మందభాగినినైన నేను దిక్కులేక యిప్పుడు ప్రాణత్యాగము గావించుకొనుచున్నాను.

(అని లతాపాశము కంఠమున నర్పించుకొనును)

విదూ—(చూచి) ఈమె యెవ్వతె? వాసవదత్తాదేవి కాదుగదా? సంభ్రమముతో బిగ్గఱగా) వయస్యా! రక్షింపుము రక్షింపుము. ఇదిగో, వాసవదత్తాదేవి యురిబిగించుకొని యాత్మహత్య చేసికొనుచున్నది.

రాజు—(సంభ్రమముతో సమీపించి) వయస్యా! ఆమె యెక్కడ, ఎక్కడ?

విదూ—ఇదిగో!

రాజు—(కంఠమునుండి పాశము దీసివేయుచు) సాహసికురాలా! ఏమిది, అకార్యము గావించుచున్నావు?

గీ. పాశ మిది కంఠగతమైనఁ బడఁతి! నీకుఁ
బ్రాణములు కంఠగతములై వచ్చె నాకుఁ;
దలఁప నీయత్న మిద్ది స్వార్థమున కయ్యెఁ
బ్రియతమా! సాహసంబును విడువు మింక.

సాగరిక—(రాజును గాంచి) ఓహో, ప్రియుఁడా యేమి?
(హర్షముతో తనలో) ఇతనిని చూచుటతో మరల నాకు జీవితాశ పొడముచున్నది. కానిచో, నితనిఁగాంచి కృతార్థనై సుఖముగా నాత్మహత్య గావించుకొందును. (ప్రకాశముగ) అయ్యో, విడువుఁడు విడువుఁడు, నేను పరాధీనురాలను. మరణించుటకు మరల నా కిట్టితరుణము దొరకదు. నీవుకూడ దేవిగారివిషయమునఁ దప్పుచేసినవాఁడవు కాకుము. (మరలఁ గంఠమున నురివేసికొన నుంకించును)

రాజు—(నిరూపించి, హర్షముతో) ఓహో, నాప్రియురాలు సాగరికయా!
(అని కంఠమునుండి పాశము తొలఁగించి)

గీ. చాలుఁ జాలు దారుణసాహసము దయిత!
విడువు మీలతాపాశము వేగరమ్మ,
కలఁగెను మదీయజీవిక నిలుప నొక్క
క్షణము నామెడ బాహుపాశముఁ బఱుపవె?

(అని ఆమెబాహుపాశము లాగి కంఠమునఁ జేర్చుకొనును. విదూషకునిఁ జూచి) చెలికాఁడా! ఈమె మేఘములేనివృష్టి.

విదూ—మిత్త్రమా! అకాలవాతావళివలె వాసవదత్తాదేవి రానిచో నిది యట్లే!

[వాసవదత్త, కాంచనమాల ప్రవేశింతురు]

వాసవ—కాంచనమాలా! కాళ్ళకుఁబడినయార్యపుత్త్రు నవమానించి నేను వచ్చుట యతినిష్ఠురతసుమీ! కావున నిపుడు నాయంతట నేను వెళ్ళి భర్త నూఱడించెదను.

కాంచన—దేవిగారు తప్ప మఱెవ్వ రిట్లు మాట్లాడఁగలుగుదురు. అతఁడే దుర్జనుఁ డగుఁగాక! దేవిగారు కావలదు. దేవి! రమ్ము రమ్ము.

రాజు—ఓసి, ముద్దరాలా! ఇప్పటికిని మేము విఫలమనోరథులమే కావలయునా? (పరిక్రమింతురు)

కాంచన—దేవీ! సమీపమునఁ బ్రభువు మాటాడుచున్నాఁడు. నిన్నోదార్చుటకే వచ్చుచున్నాఁడని యూహించుచున్నాను. దేవీ! అతని నెదురుకొనుము.

వాసవ—(హర్షముతో) అయినఁ జూడకుండఁగనే వెనుకకు వెళ్ళి కంఠాలింగనమున గౌరవించెదను.

విదూ—అమ్మా, సాగరికా! విశ్వాసము కలిగి చెలికానితో సంభాషింపుము.

వాసవ—(చెవులొగ్గి,కోపముతో)కాంచనమాలా! సాగరికయు నిచటనే యున్నదే! కావున, ఆమాటలు విందముగాక! విని యువసర్పింతుము. (అని యటులు సేయుదు)

సాగరిక—రాజా! లేనిపోనికనికరము నేల చూపెదవు? జీవితాధికయగు దేవిగారికి మరల నపరాధము చేసినవాఁడ వేలయగుదువు?

రాజు—నీ వసత్యవాదినివి. ఏలయన?

చ. స్తనయుగ మూర్పులన్ వడఁకెఁ జాల వడంకితి; నాకు మోమెఱ్ఱనిదం గానఁ, బ్రియమూడితిన్; బొమలను ముడివేయఁగఁ, గాళ్ళపైవినీతిని బడితిన్; గులీనత మతించి సపర్యయొనర్చితిన్; గనుంగొనఁ బ్రణయంబు, బ్రీతియు నకుంఠితమై యలరారు నీదెసన్.

వాసవ—(సమీపించి,. రోషముతో) ఆర్యపుత్రా! ఇది మంచిపని.

రాజు—(చూచి, వైలక్ష్యముతో) దేవీ! నిష్కారణముగా నన్ను నిందించుట భావ్యముకాదు. వేషసాదృశ్యముచే మోసపడి నీవేయని యిటకు వచ్చితిమి. క్షమింపుము. (అని పాదములపైఁబడును)

వాసవ—(రోషముతో) ఆర్యపుత్ర! లెమ్ము లెమ్ము. ఇప్పటికిని సద్వంశసంభవ యనునూహతోడనే నన్ను సేవించుచుంటివా

రాజు—(తనలో) దేవి యిదియు వినెనా యేమి? అయిన నో, నింక సర్వ విధముల దేవియనుగ్రహమున కాశ వదలుకోవలసినవార మైతిమి. (అని, అధోముఖుఁడై యుండును)

విదూ—అమ్మా! లతాపాశమున బంధించుకొని ప్రాణత్యాగము గావించుకొనుచున్నా వని నీవేషసాదృశ్యమునఁ గని పట్టి వయస్యునిదీసికొనివచ్చితిని. నామాట నీవు నమ్మనిచో, నిదిగో! ఈలతాపాశమును జూచుకొనుము.

వాసవ-(కోపముతో)ఓసీ!కాంచనమాలా! ఈలతాపాశముతోడనే యీ బ్రాహ్మణుని గట్టిపెట్టి, యీచెడుకన్యను ముందు నడవుమనుము.

కాంచన—దేవిగారి సెలవుప్రకారము గావింతును. (అని లతాపాశముచే వసంతకునికుత్తుక బిగించి కొట్టుచు) దుర్బ్రాహ్మణుఁడా! నీవినయము నకు ఫల మనుభవింపుము. "వాసవదత్తాదేవిదుర్వచనములచేఁ జెవులు గింగురుమనుచున్న" వన్నమాట జ్ఞాపకముంచుకొనుము. సాగరికా! నీవును నెదురుగా నుండుము.

సాగరిక-(తనలో)నిర్భాగ్యురాలనగు నాకు మరణింతమన్న నుగుదుర లేదు.

విదూ—(విషాదముతో) వయస్యా! దేవిబంధమునఁ బడియుండి దిక్కు లేని నన్ను మఱచిపోకుము. (అని రాజును జూచును)

రాజు—(ఖేదముతో) అయ్యో, కష్టము కష్టము!

చ. అతితరకోపమై నగవులాననిరాణిని జూచి కుందనా?
సతతము దేవికిన్ బెదరుసాగరికం గని క్రుంగిపోవనా?
వెతగొని బద్ధుఁడై కడచివెళ్ళువసంతకు నెంచి యేడ్వనా?
మతికి సుఖంబులేదు క్షణమాత్రము పెక్కువెతల్ కలంచుటన్.

ఇంక, నేనిక్కడ నుండి ప్రయోజనము లేదు. దేవిని ప్రసన్నురాలి నొన ర్చుటకై యంతఃపురమున కరిగెను. (నిష్క్రమించును)

ఇది తృతీయాంకము.

## ప్రవేశకము

[తరువాత రత్నమాలను బుచ్చుకొని కన్నీటితో సుసంగత ప్రవేశించును]

సుసంగత—(దీనముగా నిట్టూర్చి) హా, ప్రియసఖీ! హా, సాగరికా! హా, లజ్జావతీ! హా, సఖీవత్సలా! హా, ఉదారహృదయా! హా, సౌమ్యదర్శనా! ఎక్కడకు వెళ్ళి నిన్నుఁ జూడను? (అని యేడ్చును. పైకిఁ జూచి నిట్టూర్చి) అయ్యో, మాలదైవమా! అసాధారణ రూపవతిగా నీవు సృష్టించినయీ మెయే యిప్పు డవస్థాంతరము నంది యిట్టు లయ్యెను. జీవితాపేక్షఁ దక్కినయామె, 'ఈరత్నమాల నొక బ్రాహ్మణునిచేతి కి'మ్మని చెప్పి నాచేతి కిచ్చినది. ఆ బ్రాహ్మణు నన్వేషించుచున్నాను. (తెరవంకఁ జూచి) ఓహో! ఇదిగో, బ్రాహ్మణుఁడయిన వసంతకుఁ డిట్టే వచ్చుచున్నాఁడు. కావున, వీనికే దీని నిచ్చెదను.

[తరువాత సహర్షుఁడగు వసంతకుని ప్రవేశము]

వసంత—హీ, హీ, హీ! ప్రియవయస్యునిచేఁ బ్రసాదితయగు వాసవదత్తాదేవి యిపుడు నన్ను బంధమునుండి విడిచిపెట్టి, తన చేతు లారఁ బెట్టినయుండ్రములతో, లడ్డువులతో నాకడుపు నిండినది. అదిగాక, నాకామె రెండుపట్టుబట్టలు, నొక కర్ణాభరణము నిచ్చినది. ఇంక, వెళ్ళి ప్రియవయస్యుని జూచెదను. (అని పరిక్రమించును)

సుసంగత—(ఏడ్చుచుఁ దొందరగా వచ్చి) ఆర్య, వసంతకా! ఒక్కక్షణ మాఁగుమయ్యా!

విదూ—(చూచి) సుసంగతయా యేమి? సుసంగతా! ఏడ్చుచుంటి వేల? సాగరిక కేదేని ప్రమాదము సంభవించినదా?

సుసంగత—ఆర్య వసంతక! అది నివేదించుటకే నేను వచ్చితిని. దేవిగారిచే నాతపస్విని యుజ్జయినికిఁ బంపఁబడినటులు జనాపవాదము పుట్టించి, కడచినయర్ధరాత్రమున నెక్కడకుఁ గొంపోఁబడినదో తెలియుట లేదు.

విదూ—(ఉద్వేగముతో) అమ్మా, సాగరికా! హా, అసాధారణరూప వతీ! హా, మృదుభాషిణీ! దేవి నీవిషయమునఁ గ్రూరముగాఁ బ్రవర్తించినది.

సుసంగత—నీవితాపసుడు పీడితసాగరిక యీరత్నమాల వసంతకున కిమ్మని నాచేతి కిచ్చినది. కావున దీనిని పుచ్చుకొనుము.

విదూ—(కన్నీటితో సకరుణముగఁ జెవులు మూసికొని) అమ్మా! ఇట్టి పరిస్థితిలో దీనిని గ్రహించుటకుఁ జేయి యెట్లు వచ్చును?

(ఇరువురు నేడ్తురు)

సుసంగత—(దోసిలియొగ్గి) ఆమెయందేని ననుగ్రహముంచి పుచ్చు కొనుము.

విదూ—(ఆలోచించి) పోనీ, ఇమ్ము. దీనిచేతనే సాగరికావిరహోత్కంఠితుఁడగునయస్యు నోదార్చెదను.

(సుసంగత వసంతకునిచేత రత్నమాల నుంచును)

విదూ—(గ్రహించి చూచి, ఆశ్చర్యముతో) అమ్మా! ఇట్టియలంకార మామె కెటులు దొరకినది.

సుసంగత—ఆర్యా! అదే నేనును కుతూహలముతో నడిగితిని.

విదూ—అపు డామె యేమిచెప్పినది?

సుసంగత—అపు డామె పైకిఁజూచి చాలసేపు నిట్టూర్చి సుసంగతా! యిపు డాసంగతి నీ కెందు కని శోకించుట కారంభించినది.

విదూ—ఆమె చెప్పకున్నను, సాధారణులకు లభింపని యీరత్నహారము వలననే యామె మహావంశాభిజాత యనుట యథార్థము. సుసంగతా! మిత్రుఁ డెచట నున్నాఁడు?

సుసంగత—ఆర్యా!ఇదిగో, ప్రభువు దేవీభవనమునుండి తిరిగివచ్చి స్ఫటిక శిలామంటపమునఁ బ్రవేశించెను. కావున నీవు పొమ్ము. నేనును వాసవదత్తాదేవి సేవలో నుందును.

ఇది ప్రవేశకము.

# రత్నావళి



## చతుర్థాంకము

(తరువాత, ఆసనస్థుఁడైనరాజు ప్రవేశించును)

రాజు—(ఆలోచించి)

చ. సరసపుమాటలన్, నెపము చాటెడిబాసలఁ, జిత్తవృత్తికిం
గరుణ లగించువర్తనమునన్, గడుసిగ్గునఁ గాళ్ల వ్రాలుటన్
సరసనఖప్రబోధములు సంతసమందదు దేవి; యేడ్పుచేఁ
దొరఁగెడునశ్రుపూరములతోఁ దనకోప మడంచుకొనెడిన్.

(దీర్ఘనిశ్వాసతో నిట్టూర్చి) ఇప్పు డిట్లు దేవి ప్రసన్నురాలగుటచే నింక
సాగరికావిషయమైన యుత్కంఠ నన్ను బాధించుచున్నది.

గీ. అబ్జగర్భసమాంగియా నామె, నాదు
తొలివలపు పెంపు గలుగుకౌఁగిలిఁ గరంగి
పొడుచుకొను కామశరములపోటుగండ్ల
వెంట నాహృదయంబును నంటఁజొచ్చె.

(ఆలోచించి) నావిశ్రాంతి కనికిపట్టగువసంతకుఁడు దేవిచే బంధితుఁ
డైనాఁడు. ఇంక, నే నెవరియెదుట శోకింపను!

(అని, నిట్టూర్చును)

[వసంతకుని ప్రవేశము]

వసం—(పరిక్రమించి, చూచి, ఆశ్చర్యముతో) అదిగో, ప్రియమిత్రుఁడు
నిరంతరమనోవేదనచేఁ గ్రుంగినను పొగసుగానున్నశరీరముతో
విదియచంద్రునివోలె నధికతరముగ నలరారుచున్నాఁడు. అత
నిని సమీపింతును. (సమీపించి) వయస్యా! శుభము నీ వదృష్ట

వంతుఁడవు దేవిగారిచేతిలోఁ బడినన్ను మరల నీ వీకన్నులతోఁ జూడఁగలిగితివి.

రాజు—(చూచి హర్షముతో) ఓహో, వసంతకుఁడు వచ్చినాఁడు. మిత్త్రమా! కౌఁగిలించుకొనుము.

విదూ—(కౌఁగిలించి) వయస్య! దేవిగారిచే ననుగ్రహింపఁబడితిని.

రాజు—వేషమువలన నీ దేవియనుగ్రహము తేటపడినది. ఇంక, సాగరికావృత్తాంత మేమిమో చెప్పుము.

(విదూషకుఁడు భయమున ముఖమువంచియుండును)

రాజు—వయస్యా! మాటాడవేమి?

విదూ—అప్రియమును జెప్పఁజాలకున్నాఁడను.

రాజు—(ఉద్వేగముతో) మిత్త్రమా! అప్రియ మేల్ల? నిజముగా నామె ప్రాణత్యాగము గావించుకొన్నదా? అయ్యో, ప్రియా, సాగరికా!

(అని మోహము నటించును)

విదూ—(సంభ్రమముతో) ప్రియవయస్యా! ఊఱడిలు, మూఱడిలుము.

రాజు—(నిట్టూర్చి—కన్నీటితో)

గీ. నన్నదక్షిణు విడుఁడు ప్రాణనుమిత్రులార!
చేయుఁడీ నాదుపలుకు దాక్షిణ్యమూని;
తొరగఁ బోలేని మి మ్మామె తొలఁచిలాగు;
నప్పుడే గజగామిని యరిగె దవ్వు.

విదూ—ఓయీ! అన్యథా భావింపకుము. తపస్వినియగు నాసాగరికను దేవి యుజ్జయినికిఁ బంపినట్లు తెలియుచున్నది. అందుచే, నే నప్రియ మంటిని.

రాజు—ఏమి! ఉజ్జయినికే పంపివేసెనా?—అయ్యో, దేవి నాకుఁ బ్రతికూలగా నున్నది. వయస్యా! నీ కిది చెప్పినవా రెవరు?

విదూ—ఓయీ! సుసంగత చెప్పినది. అదిగాక, ఎందులకోగాని యీ రత్నమాల నాచేతి కిమ్మని పంపించినది.

రాజు—ఎందులకు? న న్నోదార్చుటకే! వయస్యా! ఏదీ, తీసికొని రమ్ము. (విదూషకుఁడు తీసికొనివచ్చును)

రాజు—(గ్రహించి, రత్నమాలను జూచి హృదయమున నుంచుకొని) ఆహాహా!

ఆ. వె. ఆమెకౌఁగిలింత నప్పు డాగతి నంది
యిపుడు జాఱిపడిన యీసరంబు
సదృశమానవస్థఁ బొదలారుసకిఁబోలె
నుండి, నాశరీర మూఱడించు.

వయస్యా! ఈరత్నమాల ధరింపుము దీనిఁ జూచియైన నేను ధైర్యము వహించెదను.

విదూ—ప్రభువువారి సెలవు (అని కంఠమున ధరించును)

రాజు—(కన్నీటితో నిట్టూర్చి,) చెలికాఁడా! ప్రియురాలిపునర్దర్శనము దుర్లభము.

విదూ—(దిక్కులుచూచి భయముతో) ఓయీ! బిగ్గఱగా నిటులు మాటాడకుము. ఒకవేళ, దేవికి సంబంధించినవారెవరేని యిక్కడ నుండవచ్చును.

[తరువాత వేత్రహస్తయగు వసుంధర ప్రవేశించును]

వసుంధర—(సమీపించి) ప్రభూ! జయము జయము. రుమణ్వంతుని మేనల్లుఁడు విజయవర్మ యేదియో మనవిచేసికొనుటకు ద్వారమున నిలిచియున్నాఁడు.

రాజు—వసుంధరా! తొరగఁ బ్రవేశపెట్టుము.

వసుంధర—చిత్తము. ఏలినవారి సెలవు. (నిష్క్రమించి విజయవర్మతోఁ గూడ మరలఁ బ్రవేశించి) విజయవర్మా! ఏలినవా రక్కడ వేంచేసియున్నారు, కావున శ్రీవారిని దర్శింపుము.

విజయవర్మ—(సమీపించి) దేవా! జయము జయము. ప్రభూ! రుమణ్వంతునివిజయమువలన, నీ వదృష్టవంతుఁడవు.

రాజు—(ఆనందముతో) విజయవర్మా! కోసలములు జయింపఁబడెనా?

విజయ—ప్రభువులయనుగ్రహమున—

రాజు—సెబాసు. రుమణ్వంతుఁడా! సెబాసు. ఇంతలో, మహాప్రయోజనము నిర్వహించితివి. విజయవర్మా! ఆకథావిస్తరము వినవలతును, వినిపింపుము.

విజయ—దేవా! వినుఁడు. ఏలినవారియాదేశముచే మే మిటనుండి కొన్ని నాళ్ళలోఁ గజ తురగ భట దుర్నివారమగు సేనలతో బయలుదేఱి వెళ్ళితిమి. రుమణ్వంతుఁడు వింధ్యదుర్గమందున్న కోసలరాజు ద్వారమునాక్రమించి సేనలను బ్రవేశపెట్టుటకారంభించెను.

రాజు—తరువాత, తరువాత.

విజయ—తరువాతఁ గోసలేశ్వరుఁడుకూడ మహాగర్వముతో రుమణ్వంతుని పరాభవము నోపఁజాలక, మదపుటేనుఁగులతోనిండిన తనసైన్యము నంతను సంసిద్ధపఱిచెను.

విదూ—ఓయీ! తొందరగాఁ దొందరగాఁ జెప్పుము.

రాజు—తరువాత—తరువాత.

విజయ—దేవా! కృతనిశ్చయుఁడయిన యాతఁడు,

మ. దురముం జేయుఁగ వింధ్యమున్ గడచి తోడ్తో మత్తనాగేంద్రభా
స్వరసైన్యంబగునన్యవింధ్యమున దిగ్భాగంబు లూఁగాడ, బం
ధురహస్తీంద్రుల బంటులం జనిపె, నెంతో వేగ బాణంబులన్
బఱపెన్ దీవ్రపుఁగిన్కఁ బూన్కిని రుమణ్వంతుఁడు తత్కోసలున్

మఱియును,

మ. తల లస్త్రాహతులన్ క్షణంబున శిరస్త్రాణాళితోఁ గూల, ర
క్తలసద్వాహిని పాఱ, నాయుధమహాధ్వానంబు పెంపార, సు
జ్వలవర్మాగ్నులు మీఱ, ముఖ్యబలముల్ భగ్నంబుగా నాజి...

రాజు—ఏమి! మనబలములుకూడ భగ్నములాయెనా?

విజయ—

కో, సలుఁ డుద్యచ్ఛరపాళులన్ ద్విషముతోఁ జచ్చెన్ రుమణ్వంతుచే.

విదూ—ఓయీ! జయము జయము. మనము జయించితిమి.

(అని నాట్యముచేయును)

రాజు—సెబాసు. కోసలపతీ! సెబాసు. శత్రువులు నీపురుషకారము వర్ణించుటచే నీమరణముకూడ శ్లాఘ్యముగా నున్నది. తరువాతఁ దరువాత.

విజయ—దేవా! తరువాత రుమణ్వంతుఁడు మాపెద్దసోదరుని కోసలములం దుంచి, దెబ్బలుతినియున్నగజబలముతో మెల్లమెల్లగా వచ్చుచున్నాఁడు.

రాజు—వసుంధరా! యౌగంధరాయణునితోఁ జెప్పుము, మాయను గ్రహావిభవముఁ బ్రదర్శింపవలయు నని—

వసుంధ—చిత్తము. దేవరవారిసెలవు.

[కాంచనమాల ప్రవేశించును]

కాంచన—దేవి నా కిట్లాజ్ఞాపించినది:—“ఓసీ, కాంచనమాలా! నీవు వెళ్ళి యీయైంద్రజాలకు నార్యపుత్రునకుఁ జూపింపు”మని. (చూచి) ప్రభు వక్కడ నున్నాఁడు. సమీపింతును. (సమీపించి) ప్రభూ! జయము జయము. దేవిగారివిజ్ఞాపనము:—ఇదిగో, ఉజ్జయినినుండి శంబరసిద్ధుఁ డనునైంద్రజాలికుఁడు వచ్చినాఁడు. కావునఁ బ్రభువు చూడవలయు నని.

రాజు—మాకు నైంద్రజాలికుని యెడల వేడుక యున్నది, కావున వెంటనే ప్రవేశ పెట్టుము.

కాంచన—దేవరచిత్తము. (నిష్క్రమించి, సింహిక చేతఁ బుచ్చుకొన్న నైంద్రజాలికునితోఁ బ్రవేశించును)

చేటి—ఆర్యా! రమ్ము రమ్ము.

[ఐంద్రజాలికుని ప్రవేశము]

చేటి—ప్రభువులు వీరే! ఆర్య! ఉపసర్పింపుము.

ఐంద్రజాలి—(ఉపసర్పించి) దేవా! జయము జయము. (సింహికఁ ద్రిప్పి బహువిధములుగా నవ్వి)

గీ. ఎవనిచే నింద్రజాలాఖ్య మెసకమెసఁగె
నట్టి యింద్రుని చరణము లభివదింపుఁ!
డెవఁడు శాంబరీవిద్య వహించె యశము
నట్టిశంబరు నర్చింపుఁ డయ్యలార!

ప్రభూ,

గీ. ధరణిపైఁ జందురుండ? యంబరము మీఁద
శైలమా? నీటిలోన వైశ్వానరుండ?
పగటి వేళఁ బ్రదోషమా? ప్రభువులమది
కేది కావలె, నది యీసతీయమవలయు.

విదూ—వయస్య! 'సావధానుఁడవు కమ్ము. ఇట్టిధైర్యము సమస్తమును జయింపఁగలదు.

ఐంద్ర—దేవా! అదియుఁగాక,

గీ. డాబుమాటలు పెక్కు లాడంగనేల?
యేది చూడఁగ మీయెద నింపుగలదొ,
యది, యది సమస్తమును నివ్వ డగపఱిచెద
మాగురువరుల మంత్రపుమహిమవలన.

రాజు—భద్రా! ఉండుము. కాంచనమాలా! దేవితో నిటులు చెప్పుము. "ఐంద్రజాలికుఁడు మీవాఁడే; ప్రదేశము నిర్జనమైనది. కావున రమ్ము. మన మిరువురము కలసియే చూతము" అని—

చేటి—దేవరవారి సెలవు. (నిష్క్రమించి, వాసవదత్తాదేవితోఁ బ్రవేశించును)

వాసవ—కాంచనమాలా! ఉజ్జయినినుండి వచ్చినవాఁడగుటచే నా కైంద్రజాలికునియందు నాకుఁ బక్షపాతము.

కాంచన—దేవిగారికి జ్ఞాతికులముపై గౌరవ మున్నది. కావున, రమ్ము దేవీ! (అని పరిక్రమింతురు)

కాంచన—దేవీ! ప్రభువు లిచట నున్నారు, ఉపసర్పింపుము.

వాసవ—(ఉపసర్పించి) ఆర్యపుత్రా! జయము జయము.

రాజు—దేవీ! వీఁడు చాలడాబులు కొట్టినాఁడు. కావున, నిక్కడనుండి మనము పరికింతము. (వాసవదత్త కూరుచుండును)

రాజు—భద్రా! ఏదీ, నీయింద్రజాలగతు లారంభింపుము.

(బహువిధనాట్యము గావించి పించికను ద్రిప్పుచు)

క. హరిహరవిరించిముఖ్యుల
సురలను జూపింతు, మఱియుఁ జూపింతు సురే
శ్వరు, సిద్ధచారణాదిక
సురనారీసమితి, నాట్యసుందరనిరతిన్.

(అందఱు నాశ్చర్యముతోఁ జూతురు)

రాజు—(పైకిఁజూచి, ఆసనమునుండి దిగుచు) ఆశ్చర్య, మాశ్చర్యము!

విదూ—సెబాసు, సెబాసు!

వాసవ—బళీ, బళీ!

రాజు—దేవీ! చూడుము.

చ. అదే! విరిదమ్మిలో ద్రుహిణుఁ; డల్లదె! శంభుఁడు చంద్రచూడుఁ;డ
ల్లదె! యసి శార్ఙ్గ చక్ర సుగదాదికచిహ్న చతుర్భుజుండు;న
ల్లదె! వెలిఏనుఁగు వెలయునట్టిసురేంద్రుఁడు; చూడు దేవి! య
ల్లదె! చలదంఘ్రినూపురగలయచ్చరలేమల మేటి నృత్యముల్.

వాసవ—ఆశ్చర్య, మాశ్చర్యము!

విదూ—(అపవారించి) ఓరి తొత్తుకొడుకా! ఐంద్రజాలికా! ఈ దేవతల నీయచ్చరలఁ జూపుటతో నేల? నీకుఁ బరితుష్టి కావలయు నన్నచో సాగరికను జూపుము.

[వసుంధర ప్రవేశించును]

వసుంధర—(రాజును జూచి) ప్రభూ! జయము జయము. యౌగంధరాయణమంత్రి మనవి చేసికొనుచున్నాఁడు—"సింహళాధిపతియగు విక్రమబాహునిచే నంపఁబడినవసుభూతి యనుమంత్రి మనకంచుకితో వచ్చియున్నాఁడు కావున, నీ శుభలగ్నముననే యేలినవారతనికి దర్శన మీయఁదగును. నేనును గార్యశేషము ముగించుకొని వచ్చుచున్నాను" అని

వాసవ—ఆర్యపుత్రా! ఇంద్రజాలము నాఁపి, మేనమామగారియింటి యొద్దనుండి మంత్రివసుభూతి వచ్చినాఁడు. కావున ముందర నతనికి దర్శన మీయవలయును.

రాజు—అట్లే చేయుదము. (ఐంద్రజాలికునితో) భద్రా! నీ విపుడు కొంచెము సేపు విశ్రాంతితీసికొనుము.

ఐంద్ర—(మరల పింఛికను ద్రిప్పుచు) దేవరవారి సెలవు (నిష్క్రమించుచు) ప్రభువువారు తప్పక చూడవలసినయాట యొకటి యున్నది.

రాజు—భద్రా! తరువాతఁ జూచెదము.

వాసవ—కాంచనమాలా! నీవు పోయి యతనికి బహుమతి నొసఁగి రమ్ము.

చేటి—దేవియాజ్ఞ. (ఇంద్రజాలికునితోఁగూడఁ బోవును)

రాజు—వసంతకా! ఎదురుగా వెళ్లి వసుభూతినిఁ బ్రవేశపెట్టుము.

విదూ—చిత్తము. ప్రభువువారిసెలవు. (నిష్క్రమించును)

(వసంతకునితోఁగూడ వసుభూతి, బాభ్రవ్యుఁడు ప్రవేశింతురు)

విదూ—అమాత్యా! రమ్ము రమ్ము.

వసుభూతి—(అంతటఁ జూచి) ఓహో, వత్సేశ్వరప్రభావము!

మ. మొదలన్ భద్రగజంబుఁ గాంచి, తురగంబుల్ చూచి, సంగీతసం
పద నాలించి, నృపాలగోష్ఠులయెడం బాగ్గాంచు, విభ్రాంతిమై
నదిరా! విస్మృతసింహళేంద్రమహానీయైశ్వర్యతన్, ద్వారమున్
గదియంజేరితి వేడ్కఁ గ్రామ్యుఁడ ననన్ దౌవారికుం డారమున్.

బాభ్రవ్య—వసుభూతీ! చిరకాలమునకు మరల స్వామిసందర్శము
చేయుదు ననీ, నిజముగా నానందాతిశయముతోఁ జెప్పఁజాలని
స్థితిలో నుంటిని. ఏమందును?

చ. తొడగుపటంబు పెన్వెఱపుతో మఱికొంత తుఱంగలించె; నే
ర్పడఁగనలేనిచూపులను బాష్పజలంబులు పెల్లు కప్పె; సం
దడిగొనునట్టిగద్గదిక నాదగు నస్ఫుటవాణిఁ బెంచె; ని
ప్పుడు నృపదర్శనేచ్ఛ పరిపూర్ణతఁ బోద్పదె వార్థకంబు నన్.

విదూ—(ఎదుటకు వచ్చి) అమాత్యా! రమ్ము రమ్ము.

వసుభూతి—(విదూషకుని మెడలోని రత్నహారమును జూచి అపవారించి)
బాభ్రవ్యా! ప్రస్థానసమయమున స్వామి రాజపుత్రి కొసంగిన
రత్నమాలయదియే యని తలంచుచున్నాను.

బాభ్రవ్య—అమాత్యా! పోలిక యున్నది. మఱి, దానిపుట్టుపూర్వోత్తర
ములు వసంతకునివలననే రాఁబట్టెదను.

వసుభూతి—బాభ్రవ్యా! అట్లుచేయరాదు. మహారాజకులమున ననేక
రత్నభూష లుండవచ్చును. నిర్ణయించుట దుర్లభము.

(అని పరిక్రమించును)

విదూ—(రాజునుద్దేశించి) ఇదిగో, వత్సేశ్వరుఁడు, మంత్రిగారు వారిని దర్శింతురుగాక!

వసుభూతి—(సమీపించి) దేవా! జయము జయము.

రాజు—(లేచి) నమస్కారము.

వసుభూతి—శ్రేయ మగుఁగాక!

రాజు—ఆర్యులకుఁ బీఠ మిదిగో!

విదూ—ఆర్యా! ఆసన మిదే, దయచేసి కూరుచుండుఁడు.

(అని యుత్తరీయము నిచ్చును)

(వసుభూతి కూరుచుండును)

కంచుకి—దేవా! బాభ్రవ్యుఁడు నమస్కరించుచున్నాఁడు.

రాజు—(పృష్ఠమునఁ జేయియిచ్చి) బాభ్రవ్యా! ఇటులు కూరుచుండుము.

(కంచుకి కూరుచుండును)

విదూ—అమాత్యా! ఇదిగో, వాసవదత్తాదేవి నమస్కరించుచున్నది.

వాసవ—ఆర్యా! అభివాదము.

వసుభూతి—ఆయుష్మతీ! వత్సేశ్వరునకుఁ దగినతనయుఁ గాంతువు!

కంచుకి—దేవీ! బాభ్రవ్యుఁడు నమస్కరించుచున్నాఁడు.

(అందఱు కూరుచుందురు)

రాజు—ఆర్యవసుభూతీ! పూజ్యుఁడగు సింహభూపతికిఁ గుశలమా?

వసుభూతి—(సైకిఁ జూచి నిట్టూర్చి) దేవా! ఏమి మనవిచేయవలెనో తెలియనేరకున్నాను. (అధోముఖుఁడై యుండును)

వాసవ—(విషాదమునఁ దనలో) అయ్యో, అయ్యో! వసుభూతి యిపుడేమి చెప్పునో!

రాజు—వసుభూతీ! కలఁతగొన్నటు లుంటివేల?

బాభ్రవ్య—(అపవారించి) ఆలసింపక చెప్పవలసినవిషయ మిప్పుడే చెప్పుము.

వసుభూతి—(కన్నీటితో) దేవా! మనవిచేయుట యశక్యమేయైనను దురదృష్టవంతుఁడనై యేలినవారికి విన్నవించుకొనుచున్నాను. పూజ్యుఁడగుసింహళేశ్వరునికొమార్తె యయినయాయుష్మతి రత్నావళి నేరాజు పాణిగ్రహణము చేసికొనునో యతఁడు సార్వభౌముఁ డగు నని సిద్ధునియాదేశము. ఆ యాదేశముపై నున్నవిశ్వాసముచే యౌగంధరాయణుఁడు పలుమాఱులు ప్రార్థించినను, వాసవదత్త దుఃఖపడు నని సింహళేశ్వరుఁ డామె నీయలేదు.

రాజు—(అపవారించి) దేవీ! మీ మాతులామాత్యుఁ డిట్లు మాటలాడుచున్నాఁడేమి?

వాసవ—(విమర్శించి) ఆర్యపుత్ర! ఇక్కడ నెవ రసత్యమాడుచున్నారో యెఱుఁగలే కున్నాను.

విదూ—ఆమె కేమైనది?

వసుభూతి—అపుడు లావణకమున దేవి యగ్నిదగ్ధయైన దని యపవాదముపుట్టించి ప్రభువులు సింహళేశ్వరుని సన్నిధికి బాభ్రవ్యుని పంపి మరల నామెకై ప్రార్థింపఁగాఁ బూజ్యభావుఁడగు సింహళేశ్వరుఁ డాలోచించి, దేవరకును మాకును జుట్టఱికము చెడకుండుఁగాక! యని రత్నావళిని ప్రభువుల కర్పించుటకై మాచేఁ బంపిరి. మేము తీసికొనివచ్చుచుండఁగా సముద్రమధ్యమున నోడ పగిలిపోయినది. (ఏడ్చుచు ముఖము వంచియుండును)

వాసవ—(కన్నీటితో) అయ్యో, దురదృష్టవంతురాలను. హా, చెల్లెలా! రత్నావళీ! ఇపు డెచట నున్నావు? నాకు జవాబు చెప్పుము.

రాజు—ఊఱడిలుము మాఱడిలుము. దైవవిధానము దురవగాహమైనది. ఓడ పగిలియు బయటఁబడిన వీ రిరువురే యందులకు నిదర్శనము. (అని వసుభూతి, బాభ్రవ్యులం జూపును)

వాసవ—ఆర్యపుత్ర! ఇది నిజమే! కాని, నా కట్టియదృష్టముకూడనా!

రాజు—(అపవారించి) బాభ్రవ్యా! ఇది యిట్లగు నని నేను తెలియ నేరకున్నాను.

బాభ్రవ్య—దేవా! వినుఁడు.

[తెరలోఁ బెద్దకలకలము]

శా. జ్వాలాజాలము హెచ్చి, సౌధములపై సౌవర్ణశృంగాకృతి
శ్రీ లీయన్, గ్లపితద్రుమాగ్రఘటికాల్చిస్తాప మేపారఁగా
లీలాశైలము ధూమపాతముల నోలిన్ నీరదశ్యామశో
భాళిం దాల్పఁగ స్త్రీలఁ గాల్చి యనలుం డంతఃపురిం జేర్చెడిన్.

మఱియును,

గీ. నేను లావణకానలంబున దేవి
కేవలము మరణించె నన్ కింవదంతి
సత్యమొనరింప నేఁడు వైశ్వానరుండు
ముట్టె నలుమూలలను నంతిపురమునందు.

(అందఱు సంభ్రమముతోఁ జూతురు)

రాజు—వాసవదత్తాదేవి కాలిపోయినదేమో!-అయ్యో, ప్రియురాలా వాసవదత్తా!

వాసవ—ఆర్యపుత్ర! రక్షింపుము రక్షింపుము.

రాజు—ఓహో, అతిసంభ్రమమువలన, దేవి ప్రక్కనున్నను గనఁబడ లేదు. (దేవిచేయి పట్టి కౌఁగిలించుకొని) దేవీ! ఊఱడు మూఱడుము.

వాసవ—ఆర్యపుత్ర! నాకోసము నేను చెప్పలేదు. సాగరిక, నిర్దయురాలనగు నాచే బంధితయై బాధపడుచున్నది. కావున, నామెను రక్షింపుము.

రాజు—ఎట్లు దేవీ!సాగరిక బాధపడుచున్నదా? ఇదిగో, వెళ్లుచున్నాను.

వసుభూతి—దేవా! ఇదేమి! నిష్కారణముగా శలభమువలె ననలము లోఁ బడఁబోదువు!

బాభ్రవ్య—దేవా! వసుభూతి లెస్సగాఁ జెప్పెను.

విదూ—(రాజుగారియుత్తరీయము గ్రహించి) ఓయీ! తొరపడకుము.

రాజు—(ఉత్తరీయము లాగుచు) ఛీ, మూర్ఖా! సాగరిక యాపదలో నుండ, నీ విపుడు నాప్రాణములు రక్షింపఁజూచెదవా?

బాభ్రవ్య—ఏమి! భరతవంశ మీయల్పవిషయమున సంశయాస్పద మగుచున్నదే? కానిమ్ము. మాటలు కట్టిపెట్టి స్వామిభక్తికిఁదగి నటులు గావించెదను.

రాజు—(పొగ చుట్టుకొనుట నటించును)

మ. అనలా! చాలును జాలు నీకు మిఁక ధూమాన్నత్యసంబంధ; మీ
ఘనతీవ్రార్చుల పెంపు బెట్టు పఱపంగా నేలనయ్యా! ప్రియా
జనితాగాథనియోగవహ్నిఁ బడి పెల్చన్ గాలిపోనట్టియీ
తను, వుద్యద్విలయాగ్నిరోచులకు సాధ్యం బెట్టు లూహించినన్.

సాగరిక యగ్నికి దగ్గఱగ నున్నదే? తొరగఁ బోయి యామెను సంభా వింతును.

వాసవ—ఏమి! మందభాగ్యరాలనగు నామాటవలన నార్యపుత్రుఁ డిట్లు గావించినాఁడు. నేనును ఒతి ననుగమించెదను.

విదూ—(పరిక్రమించుచు—ఎదురుగానయి) అమ్మా! నేను మార్గదర్శ కుఁడనగుదును.

వసుభూతి—ఓహో, వత్సరాజు వహ్నిలోఁ బ్రవేశించినాఁడు! రాజపుత్రీ విపత్తుఁజూచిన నేనుకూడ నిచటనే యాత్మహత్య గావించుకొనుట యుక్తము.

కంచుకి—(కన్నీటితో) హా, మహారాజా! హా, మహారాజా! నిష్కారణముగా భరతవంశము సంశయస్థితిలోఁ బడిపోయినది. కానీ, మాటలతోఁ బనేమి? స్వామిభక్తికిఁ దగినటులు గావించెదను.

(అని యందఱు నగ్నిప్రవేశము నటింతురు)

[తరువాత సంకెలచేఁ గట్టఁబడినసాగరిక ప్రవేశము]

సాగరిక—అయ్యో, కష్టము! అయ్యో, కష్టము! అగ్ని యంతటను బ్రజ్వలించుచున్నాఁడు. దైవవశమున నిప్పు డగ్ని నాదుఃఖావసానము గావించును.

రాజు—అయ్యో, సాగరిక యగ్నిదగ్గఱఁ బడినది. కావునఁ దొరగా నీమెను సంభావింతును. (తొరగా వచ్చి) ప్రియా! ఇప్పటికిని నడుమనే యుంటివా?

సాగరిక—(రాజును జూచి తనలో) ఆర్యపుత్రుఁడా యేమి? ఇతనిం జూచి మరల జీవితాశ పొడముచున్నది. (పైకి) ప్రభూ! రక్షింపుము, రక్షింపుము.

రాజు—భయస్థురాలా! వెఱవకుము.

గీ. ఓర్చుకొను మొక్కక్షణము ధూమోద్గమ మిది
(ఎదుటకుఁ జూచి)
అయ్యో! నీకుచాంశుకమున నగ్నిముట్టె
(చూచి)
స్థలన మందెద వేల?
(బాగుగాఁ బరికించి)
సంకెలలఁ బడితే?

కమ్మ! కొనిపోదు న న్నానుకొమ్ము కొమ్మ!

(కౌఁగిలించి కనులుమూసి స్పర్శసుఖము నటించుచు) ఓహో, ఒక్కనిముసములో నాసంతాపము చల్లాఱినది. ప్రియా! ఊఱడు, మూఱడుము.

ఆ. వె. పావకుండు నిన్నుఁబట్టియు నిజముగాఁ
గాల్పఁడాయె నేమి కారణమ్మొ?
తలఁప నతనితీవ్రతాపము నీదగు
స్పర్శచల్లఁదనమె పరిహరించె.

(కన్నులుమూసికొని చూచి) ఓహో, ఎంతయాశ్చర్యము!

గీ. అగ్ని యెచటకుఁ బోయెనో, యంతిపురము
తనరు మునువోలె
(వాసవదత్తను జూచి)
వాసవదత్త యిదిగో!

వాసవదత్త—(రాజుశరీరము స్పృశించుచు హర్షముతో) దైవకరుణచే
నార్యపుత్రుఁ డనపాయుఁడై యున్నాఁడు.

రాజు—
ఇతఁడు కంచుకి

బాభ్రవ్య—మహారాజా! జయము. దేవా! అదృష్టవంతుఁడవు. మరల
బ్రతికితిమి.

రాజు—
వసుభూతి యితఁడె!

వసుభూతి—దైవదయచే వర్ధిల్లుచున్నావు.

రాజు—
సఖుఁడ!

విదూ—జయము జయము!

రాజు—(ఆలోచించి సవితర్కముగ)
ఇది కలయో? యింద్రజాలమో యేమొ యెఱుఁగ.

విదూ—ఓయీ! సంశయింపకుము. ఇది యింద్రజాలముకదా? ఆతోత్తు
కొడుకు, ఐంద్రజాలికుఁడు చెప్పియేయున్నాఁడు. తప్పక యొక
యాట ప్రభువువారు చూడవలసియున్న దని—అదే యిది.

రాజు—దేవీ! నీమాటచే నీసాగరికను మే మిట్లు తీసికొనివచ్చితిమి.

వాసవ—(సవ్రీ) ఆర్యపుత్ర! నీహృదయ మెల్ల నే నెఱుంగుదును.

వసుభూతి—(సాగరికను జూచి,అపవారించి) బాభ్రవ్య! ఈమె రాజపుత్రి పోలికనే యున్నది.

బాభ్రవ్య—అమాత్యా! నాకు నదియే మనస్సులోనున్నది.

వసుభూతి—(పైకి రాజు నుద్దేశించి) ఈకన్య యెక్కడ?

రాజు—దేవికిఁ దెలియును.

వసుభూతి—ఈమె యెక్కడనుండి వచ్చినది?

వాసవ—అమాత్యా! ఈమె సాగరమునుండి సంపాదింపఁబడిన దని చెప్పి యౌగంధరాయణమంత్రి నాకడ నుంచినాఁడు. కనుకనే, సాగరిక యని పిలువఁబడుచున్నది.

రాజు—(తనలో) ఏమి! యౌగంధరాయణుఁ డుంచెనా? అతఁడు నాతోఁ జెప్పకుండ నేమియుఁ జేయఁడే?

వసుభూతి-(రహస్యముగ) బాభ్రవ్యా! వసంతకునిమెడలోని రత్నమాల సరిగాఁ బోలియున్నది. ఈమె సాగరమునుండి ప్రాప్తించినది. దీనినిఁబట్టి యీామె తప్పక సింహళేశ్వరరాజపుత్రిరత్నావళియే. (సమీపించి, పైకి) ఆయుష్మతీ! రత్నావళీ! నీవిట్టిదుస్థితిలో నుంటివా?

సాగరిక—(చూచి, కన్నీటితో) ఓహో, అమాత్యవసుభూతియా!

వసుభూతి—అయ్యో! చెడితిని. అభాగ్యుఁడను.

సాగరిక—అయ్యో! చెడితిని. అభాగ్యురాలను. అయ్యో, తల్లీ! అయ్యో, తండ్రీ! ఎచట నుంటిరి. సమాధాన మీయరా?

వాసవ—(సంభ్రమముతో) ఈమెయే నాచెల్లెలు రత్నావళియా!

కంచుకి—దేవీ! ఆమెయే యీామె.

వాసవ—(రత్నావళిం గౌఁగిలించి) సోదరీ! ఊఱడు మూఱడుము.

రాజు—ఏమి! మహాకులీనుఁడు సింహళప్రభువునగు విక్రమబాహుని కొమార్తెయా యీమె!

విదూ—(రత్నావళిని చూచి, తనలో) ముందే చెప్పితిని నేను, ఇది సామాన్యజనమునకు సంబంధించినయాభరణము కాదని.

వసుభూతి—(లేచి) రాజపుత్రీ! ఊఱడుము మూఱడుము. నీయక్క దుఃఖించుచున్నది. ఈమెను కౌఁగిలించుకొనుము.

రత్నావళి—(ఊఱడిలి, రాజు నడ్డముగాఁ జూచి, తనలో) అపరాధము గావించిననేను దేవికి నాముఖము కన్పఱుపఁజాలను.

(అని మొగము వంచును)

వాసవ—(కన్నీటితో బాహువులు చాఁచి) రమ్ము, అతికఠినురాలా! ఇప్పుడనుఁగుఁజెల్లెలా! రమ్ము స్నేహము చూపుము.

(అని కవుఁగిలించును)

వాసవ—(సహాస్యముగ) ఆర్యపుత్రా! ఈకఠినకృత్యమువలన నేను సిగ్గుపడుచున్నాను. కావున వెంటనే యీమెబంధములు దొలఁగింపుము.

రాజు—(పరితోషముతో) నీవు చెప్పినట్లే గావించెదను.

(సాగరికాబంధముఁ దొలఁగించును)

వాసవ—ఆర్యపుత్ర! అమాత్యయౌగంధరాయణునివలన నింతకాలము పాపమునకొడిగట్టుకొంటిని. అతఁ డెఱిఁగియును నాకుఁ జెప్పఁడాయెను.

[యౌగంధరాయణుఁడు ప్రవేశించును]

యౌగంధ—

మ. కలిగెన్ నానుడి దేవికిం బతివియోగప్రాప్తి నిర్వార్యరీ
తులతో; నన్యకళత్రసంఘటనచే దుఃఖమ్మపారంబుగా
వలచెన్ దేవిని; వత్సభూపతి జగత్స్వామిత్వలాభ మ్మొకం
డలరింపంగల; దైన దేవిఁ గన సిగ్గ చాల మోమోడెదఁ.

కానిచో, మఱి యేమి చేయుదు? అత్యంతపూజనీయులయందుసయితము ననువర్తనమునకు వీలుకలుగనిస్వామిభక్తివ్రత మిట్టిది. (నిరూపించి) వీరే, మహారాజుగారు. ఉపసర్పింతును. (సమీపించి) దేవా! జయము జయము ప్రభూ! మనవిచేసికొనకుండఁ జేసిన కార్యమునకు మన్నింపుఁడు.

రాజు—ఆచేసినపని యేదియో చెప్పుము.

యౌగం—ప్రభువులు పీఠము నలంకరింతురుగాక! అంతయు మనవి చేసికొందును. (అందఱు కూరుచుందురు)

యౌగం—దేవా! వినుఁడు—సింహళేశ్వరుని కుమారియగురత్నావళిని పాణిగ్రహణము గావించినవాఁడు సార్వభౌముఁడగు నని సిద్ధుని యాదేశము. ఆయాదేశముపై గలనమ్మికచే మేము స్వామి విషయమై యనేకవిధములుగాఁ బ్రార్థించినను, సింహళేశ్వరుఁడు వాసవదత్త మనోవ్యథ నందు నని యామె నీయలేదు.

రాజు—అపు డేమిజరిగెను?

యౌగం—అపుడు వాసవదత్తాదేవి లావణకాగ్నిలోఁ గాలిపోయిన దని కింవదంతి పుట్టించి, సింహళేశ్వరునికడకు బాభ్రవ్యుని బంపితిని.

రాజు—యౌగంధరాయణా! తరువాతివృత్తాంతము వింటిమి. మఱి, ఏమి యోజించి దేవిచేతులలో నామెను బెట్టితివి?

విదూ—ఓయీ! ఇతనియభిప్రాయము నాకుఁ దెలిసినది. అంతఃపురము నం దున్నయీయామెను, అంతఃపురగతుఁడయినరాజు సులువుగాఁ జూడఁగలఁ డని చెప్పక చెప్పుచున్నది.

రాజు—యౌగంధరాయణా! నీయభిప్రాయమును వసంతకుఁడు కని పెట్టినాఁడు.

యౌగం—చిత్తము దేవర సెలవిచ్చినట్లే.

రాజు—ఐంద్రజాలికవృత్తాంతముకూడ నీయేర్పాటే యనుకొందును.

యౌగం—కానిచో, నంతఃపురమున బంధితురాలైన యీమెను దేవర కనుఁగొనుట యెటులు? ఈమె కనఁబడనిచో వసుభూతి యీమన వాలుపట్టుట యెటులు?

రాజు—(నవ్వి) వెల్లడియగుటచే, నిపుడు చెల్లెలివిషయ మేమిచేయవల యునో దేవియే నిశ్చయింపవలయును.

వాసవ—ఆర్యపుత్ర! రత్నావళిని నా కిచ్చి పెండ్లిచేయు మని స్పష్ట ముగా నేల చెప్పవు?

విదూ—అమ్మా! మంత్రిగారియభిప్రాయము నీకు బాగుగాఁ దెలిసినది.

వాసవ—(చేతులు చాఁచి) రమ్ము రత్నావళీ! రమ్ము. నాసోదరివైన నీ కిప్పుడు తగినశుభ మగుఁగాక!

(అని రత్నావళిని తనయలంకారములచే నలంకరించి చేయి పట్టుకొని రాజును సమీపించి)

ఆర్యపుత్ర! ఈరత్నావళిని గ్రహింపుము.

రాజు—(హర్షముతోఁ జేతులు చాఁచి) దేవియనుగ్రహ మేది బహు మతము గాదు? (అని సాగరికను గ్రహించును)

వాసవ—ఆర్యపుత్ర! ఈమెపుట్టింటివారు దూరమున నున్నారు గావున వారిని తలపోయనియట్లు నీ వీమెను జూడవలయును.

రాజు—దేవియాజ్ఞప్రకారము గావించెదను.

విదూ—(హర్షముతో నాట్యముచేయును) హీ. హీ. హీ! జయము జయము, మహారాజా! పుడమియంతయును బ్రియమిత్రునిచేతఁ జిక్కినదిగదా?

వసుభూతి—రాజపుత్రీ! వాసవదత్తకుఁ బ్రణామిల్లుము.

(రత్నావళి యటులు గావించును)

బాభ్రవ్య—దేవీ! దేవీశబ్దము నీకుఁ దగియున్నది.

(వాసవదత్త రత్నావళిని కౌఁగిలించుకొని దేవీశబ్దముచే ననుగ్రహించును)

బాభ్రవ్య—నేఁటికి నాపరిశ్రమము సఫలమైనది.

యౌగం—దేవా! మీ కింకను జేయవలసినప్రియ మేమో సెలవిండు.

రాజు—ఇంతకంటెను బ్రియ మేమున్నది! ఏలయన?

మ. కలిగెన్ విక్రమబాహుమైత్రి; యఖిలక్ష్మాసారమై, సాగరాం
 తలసమ్యాగ్విభుతాప్తిహేతువగుకాంతారత్నముం గూడెఁ, జె
 ల్లెలు బ్రాపించుట దేవి యుల్లసపడెన్; లీలాగతిఁ గోసల
 స్థలి గెల్పొందితి; మింకఁ జేయఁదగుకర్జం బేది లోకంబునన్.

అయిన, నిది భరతవాక్య మగుఁగాక!

మ. తతి వానల్ కురియించి యింద్రుఁడు సమ
 స్తక్షోణిఁ బండించుతన్!
 సుర లానందపడన్ ద్విజప్రకర మి
 ష్టేజన్నముల్ సేయుతన్!
 చిరముఁ సజ్జనసంగమంబు సుఖరా
 శిం గొల్చి పెంపారుతన్!
 ధర దుర్వాఙ్మయవజ్రలేపములు సాం
 తం బంతమౌఁగావుతన్!

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.

శ్రీచింతామణీప్రెస్, రాజమండ్రి. ఇ. జి. 36 11-7-47 కా॥ 100
యస్. గున్నేశ్వరరావు బ్రదర్సు, రాజమండ్రి. ఇ. జి 42

